ఏ కెరటం ఎటు కొడుతుందో తెలియదు, మహాసముద్రంవంటి జీవితంలో,
ఏదీ ఎవరి తప్పనీ చెప్పలేం!



రామవిజేతా ఫిలింస్

# రామాలయం

స్క్రీన్‌ప్లే-దర్శకత్వం
**కె. బాబూరావు**

నిర్మాత
**కె. ఎ. ప్రభాకర్**

ఆంధ్ర: జోతీ
సీడెడ్: నవభారత్
నైజాం: ఉషా
మైసూరు: విజయా

VENUS PROCESS

JOTHEE

# దీపావళి కథల పోటీలో రు. 500 బహుమతి పొందిన రచయితలు



శ్రీ ఆదివిష్ణు



శ్రీ తాతినేని వెంకటనరసింహారావు



శ్రీ కేతు విశ్వనాథరెడ్డి

**పాఠకులు, రచయిత (త్రు) అందరికీ మా దీపావళి శుభాకాంక్షలు.**

దీపావళి కథల పోటీలో బహుమతి పొందిన రచయితలలో ముగ్గురు రచయితలు తమ ఫోటోలని పంపుతూ ఉత్తరాలు రాశారు. వాటిని యిక్కడ వేస్తున్నాము. మిగతా వారి ఫోటోలు, వివరాలు మాకు అందగానే తరువాత సంచికలలో ప్రచురించగలము. —సం.

* * *

**శ్రీ ఆదివిష్ణు**

"10.9.1940 న బందర్లో పుట్టేను. బందరు హిందూ కళాశాలలో బి. కాం. వరకూ చదివి డిగ్రీని పొందేను (1960). ప్రస్తుతం బందర్లోనే—రోడ్ రవాణా సంస్థలో ఉద్యోగం చేస్తున్నాను. వందకు పైగా కథలు రాసేను. అయిదు నవలలూ, మూడు నాటకాలూ, డజను నాటికలూ రాసేను. రేడియోకి కొన్ని రచనలు చేసేను. కొన్ని రచనలను ఇతర భారతీయ భాషల్లోకి అనువాదం కూడా చేశారు. ఆంధ్ర సచిత్ర వారపత్రికలో మనువు—మనిషి—మిధ్య నవల, ఉద్యోగం కథ, వారి కథలకు బహుమతులు వచ్చాయి. ఇప్పుడు సినిమాలకు సంభాషణలు కూడా రాస్తున్నాను.

నాకు వివాహమయ్యింది. ఇద్దరు మగపిల్లలు సంతానం. చిరంజీవి రమణ పెద్దవాడు. చిరంజీవి శ్రీను రెండోవాడు. నాకు సంబంధించినంతవరకూ ప్రస్తుతానికి వివరాలు ఇవి."

**శ్రీ తాతినేని వెంకటనరసింహారావు**

"పుట్టిన తేది 6—2—1934. పుట్టింది కృష్ణా జిల్లా అంగలూరు గ్రామం.

పెరిగి మనిషినయింది మద్రాసు గిండీ ఇంజ

పురుషుడు
ఎప్పుడూ మహారాజే.
అతని మగువ
అతనికి మహారాణి.
వారి పాప ఆనందరాశి.

కుటుంబంలోగల
అనేక ప్రవృత్తులే
మఫత్‌లాల్
బట్టలకు ప్రేరేపకాలు!




# మెఫ్రిన్ ఎస్టర్‌కాట్ టెరొసెల్

గిలిగింతలు పెట్టే రకాలలో, ముదురు రంగులలో, ముచ్చటైన ప్రింట్లలో 'మెఫ్రిన్' 100% పాలియెస్టరు చీరలు మరియు పాలియెస్టరు కలిపిన కాటన్ చీరలు; 'మెఫ్రిన్' పాలియెస్టరు కలిపిన డ్రెస్ మెటీరియల్స్ — తేలికైన లాన్స్, వేసవి కాంబ్రిక్స్ మరియు నాగరికమైన, మనోహరమైన పాప్లిన్స్, అందమైన రంగులలో, చారలలో, గళ్లలో 'ఎస్టర్‌కాట్' పాలియెస్టరు కలిపిన కాటన్ సూటింగులు; ఆధునికమైన, అద్భుతమైన రంగులలో మరియు ప్రింట్లలో 'టెరొసెల్' పాలియెస్టరు కలిపిన కాటన్ షర్టింగులు.

**మఫత్‌లాల్ గ్రూప్**

AIYARS-M.174 TL

రింగ్ కాలేజీలో. కాని తనని కట్టుకున్నాక మనిషి య్యానని శ్రీమతి అంటుంది. నలుగురు పిల్లలు. ఇద్దరు ప్లస్. ఒకమైనస్.

రైల్వే ఉద్యోగం వివిధ రాష్ట్రాల్లో పనిచేసే అవకాశం కల్గించి అనుభవం గడించిపెట్టింది. ప్రస్తుతం విశాఖపట్నం మార్షలింగ్ యార్డ్ (మర్రిపాలెం)లో ఐ. ఓ. డబ్ల్యు. గా పనిచేస్తున్నాను.

కథలు వ్రాయాలనే వెర్రి నాకు పదహారు సంవత్సరాల వయసునుండీ వుంది. కథలు అచ్చయాక ఆ 'సరకు' నాదగ్గర లేదేమో అన్న అనుమానం వచ్చి కొడవటిగంటి కుటుంబరావు గారి కొలమానం ప్రకారం 'కథలు రాస్తేగాని లాభంలేదు. అనే 'కసి' వచ్చేవరకూ తిరిగి ప్రయత్నించలేదు. అందుకే పది సంవత్సరాలు వెనుకపడ్డాననిపిస్తోంది.

ఇప్పటికి దాదాపు ఇరవై కథలు వివిధ పత్రికల్లో అచ్చయినవి. ఎక్కువకథలు ఆంధ్రపత్రికలోనే.''

* *

# ...రచయితలు

**శ్రీ శేతు విశ్వనాథరెడ్డి**

''పుట్టిన తేదీ: 10—7—1939.

చోటు: కడపజిల్లాలోని ఒక గ్రామం (రంగశాయిపురం, కమలాపురం తా.)

ప్రస్తుత వ్యాసంగం.: పి. హెచ్. డి. కోసం 'తెలుగు గ్రామనామాల భాషా పరిశీలన (కడపజిల్లాకి పరిమితం)' అనే విషయంపై సిద్ధాంత వ్యాసరచన. వాస్తవ జీవితాన్ని ప్రతిబింబించే, ఉన్నత జీవిత విధానాలకు మార్గం చూపించే, హృదయ సంస్కారానికి ప్రేరణ యిచ్చే ఉత్తమసాహిత్యం నుంచీ, సాహిత్య విమర్శనుంచీ పాటాలు నేర్చుకోవడం.

వృత్తి వివరాలు: 1961లో ఎం. ఏ. అయిన తరువాత ఒక నాలుగు మాసాలు జర్నలిజం, హైదరాబాద్'లో ఆంధ్రరత్న దినపత్రికలో. 62 జూలై నుంచీ, ఆంధ్రోపన్యాసకవృత్తి కడపలో, కాళహస్తిలో, ఇపుడు కందుకూరు ప్రభుత్వ కళాశాలలో.''




# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 22—10—'71
శ్రీ విరోధికృన్నామసం॥ కార్తీకమాసం శు॥ విదియ

సంపుటము : 65 సంచిక . 9

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు - 1

విడి ప్రతి వెల 40 పైసలు

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |


## విషయానుక్రమణిక

ముఖచిత్ర రచన : శ్రీ గెనిశెట్టి


తగుతుంది అన్నావు కాస్త ఎకువ వస్తోయున్నది
మన ఆర్థిక పరిస్థితి
బ్రిటన్ లో రష్యా గూఢచారుల భయం
మనకా బాధ లేదు, మన రహస్యాలన్నీ రష్యా వారికి ముందే తెలుసు.
యోగసాధన
శరణార్థుల భారం
మన ఆర్థిక వ్యవస్థ
ప్రగతి కల
కాంగ్రెస్(కొ)
కాంగ్రెస్(క)

# రాష్ట్ర సమైక్యతా పరిరక్షణకోసం పెద్ద మంత్రివర్గం!

పదిహేను పదహారుకుమించి ఉండదనుకున్న పి.వి.నరసింహారావుగారి మంత్రివర్గం అప్పుడే 20 పెరిగింది. వచ్చేవారం మరికొందరిని, దాదాపు ఏడెనిమిదిగురిచేత ప్రమాణస్వీకరణ చేయిస్తారు. పెద్ద మనుషుల ఒప్పందంలో నిర్దేశించిన ప్రమాణంలో మంత్రివర్గం ఉంటుందని ముఖ్యమంత్రి అదివరకే చెప్పారు. ఈ ఒప్పందం ప్రకారం 6:4 నిష్పత్తిలో ఆంధ్ర, తెలంగాణా మంత్రులు వుండాలి. ప్రస్తుతం 1:1 నిష్పత్తిలో ఉన్నారు. ఇంకా ఇద్దరు ముగ్గురు తెలంగాణాకు చెందిన వారిని మంత్రులను చేయాలని ముఖ్యమంత్రి సంకల్పించారని తెలుస్తున్నది. ఆ లెక్కన మరో ఏడుగురిని ఆంధ్రప్రాంతం నుంచి వేసుకున్నా కూడా 6:4 నిష్పత్తి చేరడం కష్టం. ఐతే ముస్లిములకు, హరిజన గిరిజనులకు ప్రాతినిధ్యం వహిస్తున్నవారిని వారి ప్రాంతానికి చెందినవారుగానే భావించడం తప్పని నరసింహారావుగారు చెబుతున్నారు.

### మంత్రివర్గంలో మరో ముగ్గురు మాజీ తె. ప్ర. స. సభ్యుల అవసరం!

ఇప్పటి 20 మంత్రులలో తెలంగాణాకు చెందిన వారు పదుగురు. మంత్రివర్గంలోని ముగ్గురు హరిజనులలో ఇద్దరు తెలంగాణాకు చెందినవారు. గిరిజన మంత్రి భీమరావుగారిది కూడా తెలంగాణమే. ముస్లిం మంత్రి శ్రీ ఇబ్రహింఆలీ అన్సారీ కూడా ఇక్కడి వారే. వీరిని వేరు చేసి మిగతావారు మాత్రమే ఆంధ్ర—తెలంగాణా మంత్రుల నిష్పత్తి నిర్ణయంలో లెక్కకు వస్తారు. ఆంధ్రకు చెందిన మరొక హరిజన మంత్రి బత్తినసుబ్బారావు గారిని, క్రిష్టియన్, మంత్రి డాక్టర్ దేవానందరావు గారిని కూడా మినహాయించవలసి ఉంటుంది. ఇలా ఆరుగురిని మినహాయిస్తే మిగిలిన 14 గురిలో ఆరుగురు తెలంగాణావారు, ఎనిమిదిమంది ఆంధ్రకు చెందిన వారు. మరొకరిని ఆంధ్రనుంచి తీసుకుంటే నిష్పత్తి సరిపోతుంది. ఐతే మరొక ముగ్గురిని మాజీ తెలంగాణా ప్రజాసమితికి చెందిన శాసనసభ్యులను తీసుకోవలసిన అవసరం ముఖ్యమంత్రికి ఏర్పడింది. తెలంగాణా మంత్రులలో కనీసం సగం మాజీ ప్రజాసమితి వారై ఉండాలని డా. చెన్నారెడ్డిగారు కోరుతున్నారు. అందుకే ఆయన శ్రీ అచ్యుతరెడ్డి, శ్రీ మాణిక్‌రావు గార్ల ప్రమాణ స్వీకరణోత్సవాన్ని వాయిదా వేయించగలిగారు. అంటే మరో ఏడుగురినైనా ఆంధ్ర నుంచి మంత్రులను తీసుకోవలసి ఉంటుంది. ఇలా మొత్తం మంత్రుల సంఖ్య 30 దాకా వెళ్లవచ్చు. ఐనా ఫరవాలేదు. రాష్ట్రసమైక్యతా పరిరక్షణ కోసం పెద్దమంత్రివర్గం భారాన్ని మోయడానికి తెలుగు ప్రజలు అభ్యంతరం చెప్పరు.

### ఆశ్చర్యం కలిగించని కారణం!

నరసింహారావుగారు స్వకీయమైన రాజకీయ ప్రాబల్యం కల వ్యక్తి అని ఎవరూ అనుకోలేదు. స్వంత వర్గమంటూ నాకేదీలేదని ఆయనే అన్నారు. కనుక మంత్రివర్గం నిర్మాణంలో ఆయన మాటిమాటికీ ఢిల్లీ వెళ్లవలసి రావడం, అక్కడ అధినాయకులతో రోజులతరబడి సంప్రదించవలసి ఉండడం ఎవరికీ ఆశ్చర్యాన్ని కలిగించలేదు. కాని ఒక ముఖ్యమంత్రి తన గురుతర బాధ్యతలను నిర్వర్తించేటందుకు కట్టుదిట్టంగా పరిపాలనను నిర్వహించాలంటే పార్టీలో ఆయనకున్న ప్రతిపత్తి పైన చాలా ఆధారపడి ఉంటుంది. వ్యక్తిగా నరసింహారావుగారి పట్ల కల సౌజన్యం అపారమైనది. అది రాజకీయ ప్రాబల్యంగాను ప్రతిష్ఠగాను మారవలసి ఉంటుంది. సహచరుల జాబితాలను ఆయన తయారు చేస్తున్న తీరు, ఎంపిక చేస్తున్న పద్ధతి, నరసింహారావు గారి వ్యక్తిగత ప్రతిష్ఠను ఇనుమడించేట్టుగా లేవు.

### ఆంధ్రప్రాంతంలో అసంతృప్తి

బ్రహ్మానందరెడ్డి గారి మంత్రివర్గంలోని పెక్కురు, సగానికి సగం కొత్త మంత్రివర్గంలోనున్నారు.

---

## భావూ బీజ

కార్తీక శుద్ధ విదియ మహారాష్ట్ర ఆడపడచులకు ఎంతో పవిత్రదినం. అన్నదమ్ముల మీద ఆడపడుచుల అభిమానానికి, అక్కచెల్లెళ్ళమీద అన్నదమ్ముల అనురాగానికి ఈరోజు కొలమానంగా వుంటుంది.

మహారాష్ట్రంలో దీపావళి నాలుగు రోజుల పండగ. ఆశ్వయుజ చతుర్దశి నుంచి కార్తీక శుద్ధ విదియ వరకు జరిపే ఈ పండగ చివరిరోజు అక్కచెల్లెళ్లకి ప్రత్యేకం. ఈరోజునే 'భావూ బీజ్' (అన్నదమ్ముల రోజు) అని పిలుస్తారు.

ఈ పర్వదినంకోసం సంవత్సరమంతా ఎదురు చూస్తుంటారు అక్కచెల్లెళ్ళు. అన్నదమ్ములు లేని అక్కచెల్లెళ్ల దురదృష్టం ఈ పండగనాడు కొట్టొచ్చినట్టు తెలుస్తుంది!

ఏ సోదరుడయినా — ఎక్కడ ఎలా వున్నా ఈరోజు నాటికి యింటికి తిరిగి రావడం ఆచారం. ఈ రోజున వస్తేనే ఆ సోదరికి ఆనందం. మరింక ఏనాడూ ఇంత ఆవేశం లభించదు.

సోదరుడు వచ్చీ రాగానే చెల్లెలు హారతి పళ్ళెంతో ఎదురవుతుంది. హారతి ఇస్తుంది. ప్రతిఫలంగా అతను ఆమెకోసం ప్రత్యేకంగా తెచ్చిన బహుమతిని పళ్ళెంలో వేస్తాడు.

ఈ హారతి తతంగం పూర్తికాగానే ఆ రోజంతా విందులూ వినోదాలతో గడుపుతారు. ఇందులో అక్కచెల్లెళ్ళతో పాటు కుటుంబమంతా పాల్గొంటారు.

భావూబీజనాటికి సోదరుడు రాకపోతే?

అతనికోసం ఉదయం నుంచి సాయంసమయం వరకూ ఎదురు చూస్తారు. ఇంకా రాకపోతే అతనేదో ముఖ్యమైన పనుల్లో మునిగిపోయినట్టూ — అనివార్య కారణాలవల్ల రాలేకపోయినట్టూ నిర్ణయించుకుంటారు.

అప్పటికి చంద్రోదయమై పోతుంది. అంతవరకు నిరీక్షిస్తారన్న మాట!

సోదరుడికోసం తయారుగా వుంచిన హారతిని చంద్రుడికి సమర్పిస్తారు. చంద్రుడిలోనే తమ సోదరుడ్ని చూసుకుని కొంత సంతృప్తి చెందుతారు.

చంద్రుడికిచ్చిన హారతి సోదరుడికి ముడుతుందని వారి నమ్మకం!

—వి. ఎస్. సుక్తాంకర్

వీరినే తీసుకోదలచుకుంటే, ఇంతజాగు, వారి గూర్చి పార్టీలో వివిధ వర్గాలతో సంప్రతింపులు ఎందుకు చేయవలసి వచ్చిందో తెలియదు. ఒందరిని తీసుకున్నా, పాత మంత్రులలో సమర్థులు ప్రముఖులు అనిపించుకున్న వారిని వదిలివేశారు. జలగం వెంగళరావుగారిని, విజయభాస్కరరెడ్డి గార్లను వదిలివేయడం ఆంధ్రప్రాంతంలో చాలా అసంతృప్తిని కలిగించిందంటే అతిశయోక్తి కాదు. విజయభాస్కర రెడ్డి గారి విషయంలో కారణాలు వ్యక్తిగతమైనవని తెలుస్తున్నది.

## కొత్త మంత్రులు

కొత్త మంత్రులలో శ్రీయుతులు బి.వి.సుబ్బారెడ్డి, జవ్వాది చొక్కారావు, కె. అచ్యుతరెడ్డి ప్రజావ్యవహారాల పరిజ్ఞానమూ, అవగాహన బాగా కలవారు. మిగతావారిని ఉత్సాహవంతులుగానే భావించవలసి ఉంటుంది. మరికొందరు శ్రీ గోపాలనాయుడు లాంటి వారి పేరును, మంత్రివర్గం జాబితా వెల్లడి ఐనప్పుడే తెలుగుదేశం ప్రజలు విని ఉంటారంటే అతిశయోక్తి కాదు. మరికొందరిని చేర్చుకున్నప్పుడు బహుశా మంత్రివర్గం అనుభవం ప్రతిభల విషయంలో సుసంపన్నమవుతుందని ఆశిద్దాము.

## ప్రజాసమితి సభ్యుల సంయుక్త ప్రకటన!

రాజకీయవాదుల అదృష్టాదృష్టాలు చిత్రంగా ఉంటాయి. రెండేళ్ల క్రితం తెలంగాణా ఉద్యమం అతి ఉధృతంగానున్న రోజుల్లో, కాంగ్రెసు శాసనసభాపార్టీ, కాసు బ్రహ్మానందరెడ్డిగారి రాజీనామా గూర్చి చర్చించేందుకు సమావేశమైంది. అందులో ఇది రాజీనామాలు పెట్టి బాధ్యతనుంచి తప్పుకునే సమయం కాదని, ధైర్యంతో పరిస్థితిని ఎదుర్కొని రాష్ట్ర సమైక్యతను పరిరక్షించాలని గట్టిగా బలంగా ఉత్సాహపూరితంగా వాదించిన వ్యక్తి వెంగళరావు గారు. తరువాత ఆయన హోం మంత్రి కావడం, తెలంగాణా అల్లర్లను, నక్సలైట్ల అరాజక చర్యలను అణచడంలో వహించిన పాత్ర అందరికీ తెలిసిందే. కాని రాష్ట్ర సమైక్యతకు ప్రమాదం తప్పిపోయిన తరువాత ఆయన మంత్రి పదవి పోయింది. అలాగే డాక్టర్ మర్రి చెన్నారెడ్డి గారి తెలంగాణా నాయకత్వం కూడా అదృశ్యమవుతున్నది. మాజీ ప్రజాసమితివారిలో నుంచి ఇద్దరిని మాత్రమే మంత్రివర్గంలోకి తీసుకొనడం న్యాయం కాదని, అచ్యుతరెడ్డి, మాణిక్‌రావు గార్లు సెప్టెంబరు 30న ప్రమాణస్వీకారం చేయకుండా వాయిదా వేయించారు డాక్టర్ గారు. హెచ్చు ప్రాతినిధ్యం మాకు ఇవ్వవలసిందే కాని మా అందరి పక్షాన మాట్లాడే అధికారం చెన్నారెడ్డి గారికి లేదని ప్రజాసమితి శాసనసభ్యులు 27 గురిలో ఇరవై మంది సంయుక్తంగా ప్రకటన చేశారు.

## పరిస్థితిని మార్చడం అవసరం

రాజకీయాల గొడవ ఎలా ఉన్నా, తెలుగుదేశం సంగతి మన నాయకులంతా కాస్త ఆలోచించడం అవసరం. సమైక్యమైన రాష్ట్రం ఏర్పడినా కూడా ఆంధ్ర, తెలంగాణా మాటలు వినపడడం శోచనీయం. ఈ రాష్ట్రం భాష తెలుగుగాను, ప్రజలది ఆంధ్ర జాతిగాను చలామణి అవుతున్నది. అలాంటప్పుడు ఆంధ్ర శబ్దాన్ని సర్కారు జిల్లాలకు పరిమితం చేయకూడదని జటావల్లభుల పురుషోత్తంగారు చెబుతున్నారు. మనకు ప్రాంతీయ సమస్యలు లేకపోలేదు. వాటిని అందరికీ సంతృప్తికరంగా పరిష్కరించవలసిందే. కాని వాటిని ఆంధ్ర, తెలంగాణాగా చిత్రించడం మానుకోవడం అభిలషణీయంగా తోస్తున్నది. రాష్ట్రం పేరు తెలుగునాడుగా మార్చాలని ఒక ప్రతిపాదన వినిపిస్తున్నది. అంతమాత్రంతో సమస్యలు పరిష్కారం కావు కాని ప్రాంతీయ విభేదాలను నిత్యం జ్ఞప్తికి తెచ్చే పరిస్థితిని మాత్రం మార్చడం అవసరం.

—వి. నాగేశ్వరరావు ●

# పాఠకులకి మనవి

దీపావళి కథల పోటీకి వచ్చిన కథలలో ఉత్తమమైనవిగా నిర్ణయించి ఆరు కథలని ఎన్నిక చేశాము. ఒక్కొక్కటీ రు. 500 చొప్పున బహుమతి పొందిన ఆరు కథలనీ ఈ సంచికలోనే వేద్దామనుకున్నాము. కానీ కొన్ని కారణాల వల్ల ఈ ఆరు కథలూ ఈ సంచికలో వెయ్యడానికి వీలులేకపోయింది. అందువల్ల అక్షర క్రమాన్ని అనుసరించి వరుసగా ఈ సంచికలో మూడు కథలు వేస్తున్నాము. మిగతా మూడు బహుమతి పొందిన కథలనీ పై వారం సంచికలో వేస్తాము.

***పై వారం సంచికలో ప్రచురింపబడే మూడు కథలు: మనోవ్యాధికి మందు — శ్రీ తాతినేని వెంకట నరసింహారావు; మాయ మనసులు — శ్రీ 'మేఘశ్యాం'; వానకురుస్తే! — శ్రీ తేతు విశ్వనాథరెడ్డి.***

ఈ ఆరు కథలలో ఏవి ఉత్తమమైనవో పాఠకులు నిర్ణయించడానికి ఒక బాలట్‌ని నిర్వహిస్తాము. పాఠకులు నిర్ణయించిన వరుసలో మొదటిదిగా ఎన్నికైన కథకి రు. 500, రెండవదిగా ఎన్నికైన కథకి రు. 450, మూడవదిగా ఎన్నికైన కథకి రు. 400, నాలుగవదిగా ఎన్నికైన కథకి రు. 350, అయిదవదిగా ఎన్నికైన కథకి రు. 300, చివరి కథకి రు. 250 ప్రత్యేక బహుమతులుగా యిస్తాము. బాలట్ పోటీ వివరాలు పై వారం సంచికలో ప్రచురిస్తాము.

దీపావళి కథల పోటీకి పంపిన వాటిలో పోటీకి ఎన్నిక అయిన ఆరు కథలు కాక ఈ కింది వాటిని సాధారణంగా ప్రచురించటానికి ఎన్నుకున్నాము.—సం॥

* అంతరాంతరాలు—ఎ. వి. రమణారావు, * అనంగుడూ—అధికారమూ—డి. కేశవరావు, * ఇది దారికాదు—చెల్లూరి సీతారాజేశ్వరరావు, * ఈ సమరం సాగిస్తాను— వాచస్పతి, * ఒక జేబుదొంగ—ఆకొండి వెంకటరత్నం, * గేమ్—విహారి—శాలివాహన, * గొయ్యి—నాయని కృష్ణకుమారి * త్యాగం—శివాని, * తెల్లగులాబి— పి. శారదా సుబ్బారావు, * టాస్ —శ్రీ. విజయలక్ష్మి, * నాకో తోడుకావాలి — పాలకోడేటి సత్యనారాయణరావు, * పట్టాలు తప్పినరైలు— శ్రీమతి, * పాత జీవితానికో కొత్త మలుపు—జీడిగుంట రామచంద్రమూర్తి, * పోలిశెట్టి పాండుగు వెంకటేశ్వరరావు, * ఫిజిక్సు మాష్టారు — పుష్పల రాజామణి, * మాణిక్య మహాలు — పాలంకి వెంకట రామచంద్రమూర్తి, * మాయ — పి. ఎస్. నారాయణ * మైక్రోస్కోప్ — భరద్వాజ, * ప్రవాసి — ప్రకాశరావు, * బాంధవ్య రహితులు — కాంతిరేఖ, * వానకురిసింది ... వేదుల మీనాక్షీదేవి, * విధి వంచితులు— పక్కలంక లక్ష్మీపతిరావు, * శ్రీపతి—కాశీనాథుని కాశీనాథ, * సంధ్య—చెంగలువ * స్వయంకృతం—మా హనుమంతరావు, * స్వయంవరం—సహారా.

**కథలు రాసి పంపిన వారందరికీ మా శుభాభినందనలు.**

# దీపోత్సవ దివ్యసందేశం

యావద్భారత దేశంలో సమస్త ప్రజలు జరుపుకునే పండుగల్లో దీపావళి అతి ప్రధానమైంది. వెలుగునుచూస్తే ఆనందం చీకటినిచూస్తే భయం కలగడం సహజం ఈరోజే ప్రజలు వెలుగుకు అమరత్వం కల్పించి ఆరాధనలు సల్పుతారు. మానవాభ్యుదయాన్ని కాంక్షిస్తూ దివ్వెలు వెలిగిస్తారు. దీపావళి పండుగ గాఢాంధకారం నుంచి ప్రకాశంవేపు మనల్ని నడుపుతుంది. ధార్మికదృష్ట్యాగూడ ఈ పండుగకు ఎంతో విశిష్టస్థానం వుంది. అత్యాచారంపై సదాచారం, అధర్మం పై ధర్మం, హింసపై అహింస, దానవత్వంపై దైవత్వం విజయానికి పరమ సంకేతం దీపోత్సవం. ప్రాచీన భారతీయ మహిమ, సంస్కృతి ఈ ఉత్సవంలో మూర్తీభవిస్తుంది.

దీపోత్సవం వర్షఋతువు ముగిసాక శరదృతారంభంలో జరుపుకొంటాము. మన భారతదేశం వ్యవసాయక ప్రధానదేశం. కావున ప్రతిపర్వం ఏదో విధంగా కర్షక లోకానికి సంబంధించిందై వుంటుంది. దీపావళి పండుగవరకు పంటలన్నీ పరిపక్వదశకి వస్తాయి. శ్రమించి శ్రమించి విశ్రాంతి వినోదంకోసం ఎదురుచూస్తున్న కర్షకలోకం ఈ పండుగను ఎంతో ఆనందంతో ఆహ్వానిస్తుంది.

దీపావళి కథావిశేషాలు అనేకులు అనేక విధాలుగా చెబుతారు: బలిచక్రవర్తి పట్టాభిషేక జయంతి చిహ్నంగా ప్రతియేట దీపోత్సవం జరుపుకొంటున్నామని కొందరు చెబితే మరి కొందరు విక్రమార్కుని పట్టాభిషేక మహోత్సవంతో ముడివేస్తారు. నరకాసురునిపై సత్యభామ సాధించిన విజయమే ఈ పండుగకు ప్రబల కారణమని చాలామంది నమ్ముతారు. శ్రీరామచంద్రుని అభిషేక సమయంలో ప్రజలు చేసిన మహోత్సవాలలో వెలిగించిన దీపాలు నేడు సాంకేతికంగా వెలిగింపబడుతున్నవని కొందరి అభిప్రాయం. లక్ష్మీదేవి వివాహం శ్రీ మహావిష్ణువుతో ఈదినమే జరిగింది. నరకాసురుణ్ని శ్రీకృష్ణ పరమాత్ముడు ఈరోజే వధించాడు. విష్ణు భగవానుడు ఈరోజే వామనావతారం ధరించి పాతాళరాజు బలిని వశం చేసుకొన్నాడు. కావునే ఆనందోత్సవంలో మునిగి దీపోత్సవం జరుపుకొంటున్నామని మరికొందరంటారు.

ఈరోజే జైనమత 24 వ తీర్థంకరుడగు మహాత్మా మహావీరుడు, ఆర్యసమాజ సంస్థాపకులగు మహర్షి దయానంద సరస్వతి నిర్వాణం చెందారు. ఈరోజే స్వామి రామతీర్థ జన్మించారు. తమ ఆరవ గురుదగు గురుహరి గోవిందసింగ్ మొగలు చక్రవర్తి జహంగీర్ కారాగృహంనుంచి విముక్తి పొందాడని సిక్కులు హర్షంతో ఈ ఉత్సవాన్ని జరుపుకొంటారు. కొందరు దీపావళిని అశోకుని కళింగ విజయోత్సవ సూచకమైన పండుగాకూడ భావిస్తారు.

ఉత్తర భారతంలో దీపావళి లక్ష్మీపూజగాను, వంగదేశంలో కాళీపూజగాను, దక్షిణాదిలో రావణవధానంతరం శ్రీరాముడు తిరిగి అయోధ్యకు వచ్చి పట్టాభిషిక్తుడైన పండుగగా జరుపుకొంటారు. జైనులు కార్తీక కృష్ణ చతుర్దశిని మహావీరుని నిర్వాణలక్ష్మి దినంగాను, అమావాస్యను మహావీరుని శిష్యుడైన ఇంద్రభూతి, జ్ఞానలక్ష్మి, సంక్రమించిన దివసంగాను ఉపలక్షిస్తారు. స్యామ్, జాపాన్, నేపాల్ మొదలగు విదేశాలలో గూడ దీపావళి పండుగ మహోత్సవంగా జరుపుకొంటారు.

దీపం త్యాగం, తపస్సు, పరోపకారానికి పరమ సంకేతం. తాను స్వయంగా కాలుతూ ఇతరులకు వెలుగునిస్తుంది. జ్యోతి పండుగ మనకు జాతీయ సమైక్యతను, సాంప్రదాయక సద్భావాలను, సాంస్కృతిక వైశిష్ట్యాన్ని జ్ఞాపకం చేస్తుంది. ఒకదీపంతో రెండోదీపం వెలిగించినట్లుగే ఒక మానవుడు తనతోటి మానవునికి సహాయం చేస్తూ ప్రేమ, మమకారం పెంపొందించాలి అన్నదే, దీపోత్సవం మనకు బోధిస్తున్న మహామంత్రం.

—నల్లపల్లి రంగయ్య

వీటిని నిటారుగా నిల్చి
పైకి వదలాలిరా గాడిదా!!






తెల్లని పాలలో వెలసిన తల్లీ
చల్లని చంద్రుని గారాబు చెల్లీ
టపాసు పటాసు పండుగ వచ్చెను
చెవలాయ్ న్యూట్రిన్ మిఠాయి తెచ్చెను
నీ దయ మరువము ఓ కల్పవల్లీ!
న్యూట్రిన్ స్వీటులు నీ వరమే తల్లీ!
న్యూట్రిన్
కన్ఫెక్షనరీ కంపెనీ
ప్రైవేట్ లిమిటెడ్,
చిత్తూరు (ఆం.ప్ర.)


nutrine
ఒక్కొక్క మిఠాయి యందు ఫలరస పూరితవి




**జి. వి. ఆర్, కొత్తగూడెం**

**జయాపజయాలు ఒక్కలా చూడడం సాధ్యం అంటారా ?**

అపజయం కూడా జయానికి నాంది. అనుకుంటే సరి. నిజానికి మనిషికి విజయం ఎంత నేర్పుతుందో అపజయం అంతా నేర్పుతుంది.

**వ్యక్తిత్వం గలిగి ఉండడం అంటే ఏమిటి ?**

ఎలా ఉండాలనిపిస్తే అలా వుండకల్గడం. నటించలేని నమ్మకంలేని పొందాగా వదలకల్గడం. ముఖ్యంగా వ్యక్తిగత ప్రత్యేకతలో నమ్మకంవుండడం అన్నీ కలిపే వ్యక్తిత్వం అనిపించుకుంటుంది.

**కె. కె. ఆర్, వెంకటగిరి**

**ఓర్పు కోల్పోకుండా ఉండడం కష్టం కదండీ !**

ఎదుటి వాళ్లు ఎలా పోయినా మనకి లెక్కలేనప్పుడు ఓర్పు ప్రదర్శించడం సులభం. కాని ఎప్పుడూ కాదు.

**పి. ఏ, నాగపూరు**

ఆంధ్ర రచయిత్రుల సమాచార సూచికలో మీ ఫోటో చూసి నేను ఆశ్చర్యపోయాను. మీరు అర్హతకు తగినవారు కాదని చెప్పదలిచాను. ఆయన అంటాడు: మీరు? నో గాడ్. నేను వివరించలేను.

మీ ఆవేదన అర్థమైంది. చిట్టితల్లీ. ఏం చేస్తాం! అప్పుడప్పుడు యీ ప్రపంచంలో యిలాంటి దారుణాలు జరిగిపోయి నీబోట్ల హృదయాల్లో చిచ్చు రగిలిస్తూ ఉంటాయి! (ఈ ఉత్తరం ఎందుకువేశానో తెలుసా? పదహైదు దాటిన ప్రతిమగాడికీ 'నువ్వందగాడివని' పరాయి ఆడది చెప్తే మహాగర్వంగా ఉంటుంది. పెళ్లాం చెప్తే లాభం లేదు. అందుకని!) నీకిదేం కాంప్లెక్సు చిట్టితల్లీ. నా మొగుడు అందంగా ఉంటే నీకంత యిదెందుకు?!



**డి, మద్రాసు**

**'ఆకాశానికి అంతుంది' అన్నది ఒక అలంకారము. అలంకార శాస్త్రంలో దీన్ని న్యూనాభేద రూపకము అంటారు. మూడవ కన్ను లేని శంభుడు, మచ్చలేని పున్నమ చందమామ పాలసంద్రమున పుట్టని లక్ష్మి పతి**

థ్యాంక్యూ దాశరధిగారూ.

**ఎస్. ఎస్. కె. పి, చిట్యాల్**

**వివాహబంధం తెంచుకోలేనిది. జీవితాంతం ఉండవలసిందే కదా. మరి అపార్థముల మూలంగా మలినమయితే?**

విడాకులు.

**ఒక తెలుగు పాఠకుడు, జి. సుబ్బారావు, రాజమండ్రి**

నే నొక రాజమండ్రి పౌరుణ్ని. ఇటీవల జరిగిన రచయిత్రుల సభలకు హాజరయిన వారిలో నే నొకడిని. ఆ సభలలో ప్రఖ్యాత రచయిత్రులు చాలామంది పాల్గొనక పోవడం మాకు ఆశ్చర్యాన్ని కలిగించింది. ప్రముఖ శ్రీమతి సుబ్బారామమ్మ, శ్రీమతి ఎన్. కోటీశ్వరి, శ్రీమతి మంగలత, శమంతకమణి మొదలైన రచయిత్రుల పేర్లను నే నెన్నడూ వినియుండలేదు. వారి రచనలు ఏమిటి ? రచయిత్రుల సభలలో పాల్గొనేందుకు అధికారం వారికెలా లభించింది? కుల వర్గ బంధుత్వాది సంకుచిత విషయాలకు సభలో భాగముందా? సమావేశములలో పాల్గొనే రచయిత్రుల పేర్లను సూచించినది ఎవరు? రచయిత్రుల సాహిత్య అకాడమి సలహా సంఘ సభ్యులుగా మీరా ప్రశ్నలకిచ్చే సమాధానం ఏమిటి? ఈ ఉత్తరం పూర్తిగా ప్రచురించి నిష్పక్షపాతమైన మీ సమాధానం ఇచ్చే బాధ్యత మీపై ఉన్నదన్న సంగతి మీరు మర్చిపోకండి.

రాజమండ్రి సభలకి పూర్తి బాధ్యత శ్రీమతి పూటుకూరి లక్ష్మీకాంతమ్మ గారిది—రాజమండ్రిలో సభలు జరపాలని నిర్ణయించిన తరువాత కమిటీని సమావేశ పరుచలేదు. కార్యక్రమాన్ని సక్రమంగా చర్చించే అవకాశం ఎవరికీ యివ్వలేదు. కనీసం నాకే సభలు ఫలానా తేదీలని తెలియచేయలేదు. యిక యితర రచయిత్రులకు ఆహ్వానాలు వెళ్లాయంటే కూడా ఎలా నమ్మడం? యిక కులవర్గ బంధుత్వాది విషయాలు కళ్లారా చూసిన మీరారు చెప్పాలి. నేనేం చెప్పకలను? అక్కడ జరిగిన ఫియాస్కోకి నా సమితి లేదని మాత్రం చెప్పుకోకలను.

**కళ్యాణశ్రీ, కోవెలకుంట్ల**

**అత్యంత వైభవంగా ఏలే వారెవరు?**

సాగితే, ఆడవాళ్లు, ఎప్పుడూ పసివాళ్లు ఏలుతూనే ఉంటారు.

**ఎమ్. బి, తాడిమర్రి**

**మనిషి డబ్బుని సంపాదిస్తాడు. కాని ప్రజలు అటువంటి మనిషిని వదలి డబ్బునే గౌరవిస్తారెందుకు?**

ఆ నేర్పు కొందరికే ఉంటుంది కనుక!

**ఎస్. పి, హైద్రాబాదు**

**నేను ఒకరిని ప్రేమించాను. అతన్ని పరిణయం చేసుకున్నాను. నా ప్రాణ స్నేహితురాలిని పరిచయం చేశాను, వారిద్దరూ చనువుగా మాట్లాడుకుంటారు అతని ఉద్దేశ్యం ఏమై ఉంటుంది.**

బహుశా! ఆ స్నేహితురాలి కోసమే తమ ప్రేమ స్వీకరించాడేమో ఆలోచించండి అమ్మాయిగారూ.

**నీలిమ; స్వాతి, మద్రాసు**

**చదువుకున్న చదువు విజ్ఞానం జీవిత సత్యాలకు అన్వయించుకొన్న నాకు జీవితం చీకటి పాలైంది. కులాంతర వివాహానికి మగపెళ్లి వారు ఒప్పుకొన్నా ఆడ పెళ్లివారు అమ్మాయి ఒప్పుకోవడం లేదు**

అంతమాత్రానికే జీవితం చీకటి దారిన పడింది అనుకుంటే ఎలా? కోరివచ్చిన వరుని కాదన్న నష్టం అమ్మాయికేగాని మీకుకాదు. బెంగపడకండి.

**సి. హెచ్. జి. ఆర్, విజయపురి నార్త్**

**ఒక్క 'బీనాదేవిగారు' మినహా ఎవరూ తెలుగులో మంచి రచనలు చేయడంలేదని నా అభిప్రాయం.**

అప్పుడు అంతా 'బీనాదేవి' లు కారుకదా! వాళ్లెలాగే మంచి రచనలు ఎలా చేస్తారు?




రూ. 98

ఎక్సైజు డ్యూటీతో మాత్రము కలిపి
ఇతర పన్నులు అదనం.

# మర్ఫీ
# బేబీ డీలక్స్

## సుమధురమైన ధ్వని గల
## పాకెట్ ట్రాన్సిస్టరు



ఈ పాకెట్ ట్రాన్సిస్టరు పెద్ద ట్రాన్సిస్టరు వలె సున్నితమైనది మరియు పటిష్ఠమైనది. మీడియం వేవ్ బ్యాండ్ అంతటిని మీకు మేళవింప చేస్తుంది. అయినను, రెండు ఎకనామికల్ పెన్సిల్ సెల్స్ పై పని చేయబడుతుంది. అన్ని వేళలా అత్యంత మేలైనది ఈ మర్ఫీ వారి పాకెట్ ట్రాన్సిస్టరు.

**మర్ఫీ** *ఇంటిలో అందరి ఆహ్లాదమునకు!*

NAS 275

**నెం. 88: 14 క్లూలు (తెలుగు తర్జుమా)**

1. పక్షపాతం మతబేదాల ప్రకటనయ్యే వున్నది అనురాగం/ప్రశంస సమపోలికల ప్రకటన య్యే వున్నది.
2. జీవనం సందర్భంలో మానవుని తెలిసిన దనం/అపేక్ష క్రమక్రమంగా హెచ్చుతూ వుంటుంది అనేది సామాన్య జ్ఞానంతో గూడిన విషయం.
3. అనేకమంది జనులు తమ వృత్తిని ఏకాంత ఖైదునుండి విముక్తిచేసే నిమిత్తం తమ వృత్తుల/విరామకాలముల సహాయ మును ఆశించవలసియున్నది.
4. సౌందర్యం/ మానవత్వం యొక్క యోచన చాల శక్తివంతం మరియు హృదయ ప్రేరేపకం మనుష్యుడు దానిని తన అంత రంగమున మవునంగా గుప్తపరచియుంచు కొనజాలడు కాని శబ్ద రచనతో వర్ణింప సర్వదా యత్నించుతాడు.
5. ఆచారనీతులు / రాజనీతులు మరియు యుద్ధం పారంపర్యా విచిత్ర సహచారులను కలిగిస్తాయి.
6. ఈనాడు స్త్రీల స్థితిని/స్వతంత్రతను కొద్దిమంది జనులు ఆక్షేపించ సాహసింప గలరు.
7. ఫేషన్‌లు / రాష్ట్రములు నశించవు అనేది విచిత్ర యదార్థం.
8. మన మందరమున్ను మన దురాగ్రహాలకు, మన భయములకు మరియు నిరాశలకు/ మూఢవిశ్వాసాలకు హతాశులమై యున్నాము.
9. మీరు ఆదర్శం / యదార్థం తప్ప మరి దేనినీ ఆదర్శమయ మొనరింప జాలరు.
10. మన సర్వశ్రేష్ఠ ఆదర్శాలు/ ప్రతిష్టాప నలు అన్నియు జనుల నిద్రమత్తు మరియు స్వార్థత మరియు మానవ స్వాభా విక శుద్ధ లోటువల్ల చెడిపోవును.
11. పరంపరాగతంగా మన పూర్వుల యొక్క మానసిక సఫలతలు భాష / సాహిత్యమం దందు ఏకీభవించును.
12. లోకతంత్రమందు నమ్మికగల జనులనుండి నిరంకుశాధికరం కంటె చాలా పెద్ద నైతిక/ వ్యక్తిగత త్యాగములను ఆశించును.
13. వ్యక్తి తన సహచర జీవులలో ఎంత ఎక్కువ మంది జనులతో సక్రియ మరియు సహా యోగ సంపర్కమును గలిగియుంటాడో వ్యక్తి అంత అధిక ప్రతిభను/ లోక యత్వంను కలిగియుంటాడు.
14. ఏ స్మారకములను నిర్మించదు/సన్మా

**No: 88—14 CLUES**

(1) Discrimination is the discovery of differences; AFFECTION/APPRECIATION is the discovery of similarities.

(2) It is a matter of common knowledge that man's APPRECIATION/EXPECTATION of life is being steadily extended.

(3) Many men have to look to their AVOCATIONS/VACATIONS to save them from the solitary confinement of their vocation.

(4) The thought of BEAUTY/HUMANITY is so powerful and moving that man cannot contain it silently within himself, but always tries to clothe it in words.

(5) ETHICS/POLITICS and war traditionally make weird bed—fellows.

(6) Few people dare to challenge the EXISTENCE/INDEPENDENCE of women today.

(7) It is a strange fact that FASHIONS/NATIONS do not die.

(8) We're all victims of our prejudices, our fears and FRUSTRATIONS/SUPERSTITIONS.

(9) You cannot idealise anything except the IDEAL/REAL.

(10) All our best IDEALS/INSTITUTIONS break down on the lethargy and selfishness of men and the sheer inadequacy of human nature.

(11) LANGUAGE/LITERATURE embodies in a traditional form the mental achievements of our predecessors.

(12) Democracy make upon those who believe in it far bigger MORAL/PERSONAL demands than dictatorship.

(13) The more a man is in active and helpful touch with a large number of his fellow creatures, the larger is the PERSONALITY/POPULARITY of the man.

(14) Nature RAISES/RESPECTS no monuments.

లిట్ క్విజ్ కొటేషనులన్నియు రచయితల రచనల నుండి గ్రహింపబడినవి. అవి వేనికవే పూర్తి అర్థములు గలవి. ఒక్కొక్క క్లూకు మారు పదములు అక్షరక్రమమున యేర్పాటు చేయబడినవి. మొదటి మారు పదముల యొక్క అక్షర క్రమమున క్లూలన్నియు యేర్పాటుచేయబడినవి. లిట్‌క్విజ్ రిక్తి అఫిషియల్ సొల్యూషనుతో రచయితల పేర్లు, వారి రచనల పేర్లు ప్రకటింపబడును.

# ఒకవారం విపరీతం

## దొరికిపోయిన ఆడదొంగ !

సుశీలా నారాయణ డోంగ్రే అనేఆమె 1945వ సంవత్సరం నుంచి నేటిదాకా మొత్తం 61 దొంగతనాలు నిర్విఘ్నంగా చేసిందట. కాలం సరిరాక, మొన్న ఫిబ్రవరిలో అంకోలా రైల్వేస్టేషనులో ఒకామె మెడలో నెక్లసు తస్కరిస్తుండగా పట్టుబడి పోయిందట. ఈమె గత చరిత్రను, హస్తనైపుణ్యాన్ని కోర్టు వివరించి చర్చించి, యీమెకు 5




సంవత్సరాలు కఠిన కారాగార శిక్ష విధించిందట. పాపం!! చోరకళ చతుష్షష్టి కళల్లో ఒకటికాదూ!

## లైట్స్ఆన్

కోకన్ చక్రవర్తి అనే సి. ఎ. యం.వ్యక్తిని కలకత్తా లామెర్కమర్‌లో ఎవరో బాంబువిసిరి చంపారట. * గారియాలో రబిన్ దాస్ అనే కానిస్టేబులొకడు బజారుకు వెళ్ళి వస్తుండగాఎవరో అతన్ని కాల్చి చంపేశారట. * గురుదాసపూరుకు చెందిన కుందన్‌సింగ్ రణధావా అనే పోలీసు అధికారి వో కేసులో సాక్ష్యం యివ్వడానికి కపుర్తాలావెడుతూ గార్హారోడ్డులో వున్న తన యింటిలో 28 రాత్రి మకాంగా ఆగితే ఆరోజు తెలతెలవారుతుండగా వో ముగ్గురు ఆయన మీద పడి, ఆయనపిస్తలు లాక్కుని, దానితోతోనే ఆయన్ని చంపేసి,పారి పోయారట. * కలకత్తా రామ్‌పరాలో నక్సలైటుల గుంపును చెదర గొట్టడానికి పోలీసులు జరిపిన కాల్పులలో వో నక్సలైటు చనిపోయాడట.

* * *

రాష్ట్రపతి వాడటానికని జర్మనీనించి మా రయ్యే మెర్సెడిస్ బెంజా 600 కారు ఒకటి దిగుమతి చేశారో, చేస్తున్నారోట. దీని వెల— దిగుమతి సుంకాలు వగయిరా లేకుండానే— రెండు లక్షల చిల్లర మాత్రమేట.... పేదరికాన్ని ఈ విధంగా నయినా బహిష్కరిస్తున్నారు. సంతోషం, అన్నాడొకాయన ఈ వార్త విని...

# మరల గొప్ప బహుమతి!



## సరియైన మొదటి 3 పదాలకు రు. 15,000

లిట్ క్విజ్ నెం. 88 అధికారం ఎంట్రీ ఫారము

మొత్తము బహుమతి: రు. 1,00,000/— అఖరు ముగింపు తేదీ 27—10—71 గురువారం

ADDRESS: LITQUIZ No 88 ALANKAR, BALARAM STREET BOMBAY

గమనిక:— 1. ఒక్కొక్క కాలంలో మీరు వద్దనే పదమును కొట్టివేయండి. 2. ఒక కూపను మాత్రం పంపినచో ఇతర కూపనులను కొట్టివేయండి, 3. ఎంట్రీ రుసుము M. O. ద్వారా పంపినచో, పోస్టాఫీసునుండి పొందిన M.O. రసీదును ఎంట్రీ ఫారమునకు జతపరచవలెను. M. O. రసీదు లేని ఎంట్రీలు నిరాకరింపబడును. 4. I. P. O. క్రాస్ చేయవద్దు. అది లిట్‌క్విజ్ నెం. 88. బొంబాయి—7 వారికి చెల్లించునట్లు ఉండవలెను.

| 88 | 1 | Re. 1 | 2 | Re. 1 | 3 | Re. 1 | 4 | Re. 1 |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | AFFECTION | APPRECIA- | AFFECTION | APPRECIA- | AFFECTION | APPRECIA- | AFFECTION | APPRECIA- |
| 2 | APPRECIA- | EXPECTA- | APPRECIA- | EXPECTA- | APPRECIA- | EXPECTA- | APPRECIA- | EXPECTA- |
| 3 | AVOCATIONS | VACATIONS | AVOCATIONS | VACATIONS | AVOCATIONS | VACATIONS | AVOCATIONS | VACATIONS |
| 4 | BEAUTY | HUMANITY | BEAUTY | HUMANITY | BEAUTY | HUMANITY | BEAUTY | HUMANITY |
| 5 | ETHICS | POLITICS | ETHICS | POLITICS | ETHICS | POLITICS | ETHICS | POLITICS |
| 6 | EXISTENCE | INDEPEND- | EXISTENCE | INDEPEND- | EXISTENCE | INDEPEND- | EXISTENCE | INDEPEND- |
| 7 | FASHIONS | NATIONS | FASHIONS | NATIONS | FASHIONS | NATIONS | FASHIONS | NATIONS |
| 8 | FRUSTRA- | SUPERSTI- | FRUSTRA- | SUPERSTI- | FRUSTRA- | SUPERSTI- | FRUSTRA- | SUPERSTI- |
| 9 | IDEAL | REAL | IDEAL | REAL | IDEAL | REAL | IDEAL | REAL |
| 10 | IDEALS | INSTITU- | IDEALS | INSTITU- | IDEALS | INSTITU- | IDEALS | INSTITU- |
| 11 | LANGUAGE | LITERATURE | LANGUAGE | LITERATURE | LANGUAGE | LITERATURE | LANGUAGE | LITERATURE |
| 12 | MORAL | PERSONAL | MORAL | PERSONAL | MORAL | PERSONAL | MORAL | PERSONAL |
| 13 | PERSONALI- | POPULARITY | PERSONALI- | POPULARITY | PERSONALI- | POPULARITY | PERSONALI- | POPULARITY |
| 14 | RAISES | RESPECTS | RAISES | RESPECTS | RAISES | RESPECTS | RAISES | RESPECTS |

**MINIQUIZ — FREE AFTER 4 COUPONS**

| | | | |
|---|---|---|---|
| BEAUTY | HUMANITY | FRUSTRA- | SUPERSTI- |
| ETHICS | POLITICS | IDEAL | REAL |
| EXISTENCE | INDEPEND- | IDEALS | INSTITU- |
| FASHIONS | NATIONS | LANGUAGE | LITERATURE |

ఈ క్విజ్ ప్రవేశమునకు చెందిన నిబంధనలను, షరతులను పాటించుటకు అంగీకరిస్తున్నాను. మరియు కాంపిటేషన్ ఎడిటరుగారి నిర్ణయమును తుది నిర్ణయముగాను, న్యాయబద్ధమైనదిగాను అంగీకరించుటకు ఆమోదిస్తున్నారు. ప్రతి కూపనుకు ఎంట్రీ ఫీజు రు. 1/— ఈ పూర్తి ఎంట్రీ ఫారము (4 కూపనులకు) ఫీజు రు. 4/— M. O. రసీదు / I. P. O. / లిట్‌క్విజ్ క్యాష్ రశీదు ప్రైజు కార్డు జతపరుస్తున్నాను. వాటి నెం.....................

నెం. 89 ఫారములు పొందుటకై దీనిని పూర్తిచేయండి.

FULL NAME ..............................

..............................

ADDRESS ..............................

..............................

..............................

POST .................... DIST..........

88 (ASVP)

IN ENGLISH: BLOCK LETTERS

FULL NAME ..............................

..............................

ADDRESS..............................

..............................

..............................

POST .................... DIST..........

ఈ పూర్తి ఫారమును కత్తిరించి పంపవలెను

గమనిక:—ఇవన్నియు కొటేషనులు. వీనికి రచయిత వాడిన పదములే సరియైన జవాబులు. అఫిషియల్ సొల్యూషన్ తేది 31—10—71 గల సండే స్టాండర్డ్ సిటీ ఎడిషన్ (కడపటిపేజీ)నందున్ను బహుమతుల సట్టీ లిట్‌క్విజు వీక్లీ అడ్వాన్సు 7—10—71 యందును, పూర్తిగా కుదింపబడి తేదీ 14—10—71 సండే స్టాండర్డ్ నందును ప్రకటింపబడగలదు. 30 పైసలుపంపి ఏ భాషలో అనగాతమిళము, తెలుగు కన్నడ భాషలందుగల తర్జుమాలను పొందండి.

పె. ని క్విజ్


ఈసారి నేను బాంబులు కొనిస్తా నయ్యా! కానీ మీరు నాకిస్తే ఎక్కడో ఫర్లాంగు దూరంలో పేలేట్లు ఏర్పాటు చెయ్యాలి - తెల్సిందా?
ప్రతి పండుక్కు నేను శుచిగా శుభ్రంగా వుంటాను
మిగతాప్పుడు వుండరాండీ?


నేనో నవల రాస్తున్నారా - అది పూర్తయే వరక్కూ నేను టపాకాయలేవి కాల్చదలుచుకో లేదు!


ఈ వీధిలో టపాకాయలు కాల్చడానికి వీలు లేదు కాబట్టి కొనకుండా బజారికి పోయ్యాన్ను!




అవన్నీ ఒక్కసారే
కాలుస్తాట్ట! కానీ
తాగితే భలే ధైర్యం
వస్తుందిరా!




ఇప్పుడు వాసన లేనిదీ, ధర తక్కువయినదీ,
నిరపాయకరమైనదీ, చిన్నపిల్లలు కాల్చగలిగేదీ-
వుండనే వుంది- అవే మనం రోజూ
వాడే అగ్గిపెట్టెలే కదండీ?
ఇచ్చట
టపాకాయలు
అమ్మబడును




చిచ్చుబుడ్డి వెలగలేదు
అనుకున్నప్పుడు మళ్ళీ
వెలిగించాలిగాని - వుష్...
వుషూ- అని వూదితే ఏమవుతుంది?


వక్తృత్వ పోటీలో బహుమతి
రాకపోతే పోయిందిలేరా-
వ్యాసాల పోటీకి రాసి గెలువు!





సినిమా చూడడంలో జీవాత్మను లీనం చేసి ఆ కాసేపూ ఆకలిదప్పులు మరచి పోయానేమోగాని ఇవతల పడ్డాకే ఆత్మా రాముడు అసలు అల్లరి ప్రారంభించాడు. ఆర్రోజు ఆఫీసులో పని అయేసరికి తొమ్మిని దాటిపోయింది. ఇంత కాఫీ తెప్పించుకుని తాగి, ఓ సిగరెట్ తీసి వెలిగిస్తూంటే సెకండ్ షో ఫస్ట్ బెల్ వినిపించింది. ఆ ఆహ్వానాన్ని తిరస్కరించలేక హాజరయి వస్తున్నాను. అంత్లో అర్ధరాత్రివేళ దొరుకుతాయని! అబ్బల్లా హోటల్లో ంలు తిని టీ ఆరగించామగాని కొండనాని కబురందినట్టు లేదు.

ంతాళం తీసుకుని లోపలకి రాగానే ఆహ్వానించింది. పనిమనిషి పెట్టి జాను నీళ్ళు. అలా ఎత్తి పెట్టుకుని గటగట తాగేస్తూంటే అమ్మమాట జ్ఞాపకంవచ్చి అలాగే ఉండిపోయాను— 'ముందే అన్ని మంచినీళ్ళు తాగేస్తే అన్నమేం తింటావు బాబూ ?'

ఇప్పుడలా అనిపిస్తోంది గాని అమ్మ బతికున్నాన్నాళ్ళూ ఆవిణ్ణి అల్లరిపెట్టని రోజు లేదు. చిన్నప్పుడు బడినుంచి ఇంటికి రాగానే చిరుతిళ్ళకోసం నాముక్కూ కళ్ళూ మూల మూలలా గాలించేవి. అన్నం విస్తరితోపాటు ఫలహారాలపళ్ళెం లంచంగా పక్కనుంటే గాని భోజనానికి రావని మారాం చేసే వాణ్ణి 'కడుపునిండా ఇంత అన్నం తినరా బాబూ!' అని ఏరోజుకారోజు బతిమాల వలసిందే. 'అబ్బ, ఉండవే, చంపేస్తున్నావు!' అని విసుక్కునేవాణ్ణి. ఇక సాయంకాలం ఒళ్ళు అలసిపోయేలా ఆడివస్తే ఎన్ని మంచినీళ్ళు తాగినా ఇంకా తాగాలనే ఉండేది. ఇక కాస్త పెద్దవాడినై కాలేజీలో స్టూడెంట్ గిరీ వెలిగించే రోజుల్లో ఏ రాత్రయినా సరిగ్గా భోజనాలవేళకి ఇంటికొచ్చానా! అప్పుడే ఆరంభమయింది నాకీ సెకండ్ షోల పిచ్చి. మా నాన్నగారికి సాయంకాలం ఆరూ ఆరున్నరకి మస్తుగా టిఫిన్ తిని కాఫీ తాగి ఊరి మీద బలాదూరు తిరగడం అలవాటు మళ్ళీ తొమ్మిదిన్నకే రాత్రి భోజనం చేసేవారు. ఆ అలవాటే మాకూ అయింది. ఇంటి కొచ్చి భోంచేసి మరీ సినిమాకి వెళ్ళమని బతిమాలేది అమ్మ, పోనీ అలాగే చేస్తాంలే అనుకునేవాణ్ణి. కాని ఫ్రెండ్సుతో కబుర్లలో పడి సినిమాకి వెడితే ఆట అయిపోయిన తర్వాతగాని ఇల్లు గుర్తుకు వచ్చేదికాదు!

ఇక ఆ అవసానివేళ, పిల్లిలా ఇల్లు

చేరుకునేవేళ, అమ్మ పడుకుంటుందేమో అని బాధ, నాన్న మేలుకుని ఉంటారేమో అని బాధ! ఈ నాన్నాజీలకి వేడి వేడిగా వడ్డించడమేగాని, తియ్య తియ్యగా తిని పించడం తెలీదుగదా! చిత్రం ఏమిటంటే 'అమ్మా అన్నం పెట్టవూ?' అని ఏ ఒక్కనాడూ నేను అడక్కుండానే అమ్మ అమర్చి పెట్టేది. నాకేంకావాలో నాకంటె అమ్మకే ఎక్కువ తెలుసేమో అనిపించేది. చందమామని చూపించి, మంచి మాటలాడి, తినిపించినా, బూచిపేరు చెప్పి బెదిరించి ఇంకా వినకపోతే దెబ్బ పైకిపోకుండా పిర్ర మీదా బుర్ర మీదా ఎగా దిగా వాయించి, బలవంతాన కూరిగా పిల్లలు గవ్వ చల్లని తల్లికి చెల్లింది. ఏ విధాన్ని అయితేనేం అబ్బాయి కడుపునిండడమే అమ్మకి కావలసింది. అమ్మ అనే ధన్యజీవికి ఈ లోకంలో ఉండడం, లేకపోవడంతో సంబంధం లేదు, అబ్బాయికి ఆకలి వేసినప్పుడల్లా అమ్మ జ్ఞాపకం వస్తూనే ఉంటుంది!

కాని, ఆ అర్ధరాత్రి ఆకలివేళ కేవలం ఆలోచనతో తృప్తిపడడం నాకు చేత కాలేదు. కంచంనిండా మజ్జిగన్నం కలిపితెచ్చి, కొసరికొసరి తినిపించే అమ్మ లేకపోయిందనే ఆలోచనతో నా కన్నీళ్ళు ఆగలేదు.

కళ్ళొత్తి, పక్కకు తిరిగి చూసేసరికి టేబిల్‌మీద ఫోటో ఫ్రేమ్‌లో సరోజ, పరిహసిస్తూ నన్ను పలకరించినట్టు అనిపించింది.

'అమ్మ'లు ఆ చంద్రార్కం ఉండిపోతారా అబ్బాయిగారూ? అమ్మాయిలు వచ్చి అనతికాలంలో అమ్మల ఛార్జి తీసుకోరూ? కంగారుపడక కాస్త ఓపిక పట్టండి. కాబోయే కాంతారత్నాన్ని, కావలసింది చేసి పెట్టడానికి నేను లేనూ?'

తడిసిన నా కళ్ళల్లో రంగురంగు దృశ్యాలు కనిపించాయి.

ఇద్దరం బాగా చదువుకున్నాం. ఉద్యోగాలు చేసి 'మొయ్యా!' గడించుకుంటాం. పగటిపూట మాకు తీరిక ఉండదు. ఉండకపోతేనేం, లోకమంతా ఏకమై పగలంతా పడుచువారికి ఊపిరి తిరగకుండా పని కల్పించుగాక. పగలంతా ప్రతీక్షణం రాత్రి కోసం ఎదురుచూడగలం. సాయంకాలం జీవుడు ఇల్లు చేరుకున్నాక ఏంచేస్తాం? తలారా ఒక్కస్నానం చేసేసరికి, శరీరానికి పట్టిన చెమటతోపాటు, మనసుకి పట్టిన ఆలసటకూడా కడిగేసుకుంటాం. కమ్మ కమ్మగా, గరంగరంగా, కడుపు విరిగేలా టిఫిన్లు వాయిస్తాం. కన్ను చెదరేలా గంటలతరబడి ముస్తాబు అవుతాం. ఒక్కొక్కరం ఇరవై పైసల స్పెషల్ కిళ్ళీలు మూడేసి చొప్పున ఒక్కసారే నోటకింగించి. సినిమారోడ్డున పడతాం. ఈ ట్యూబు లైట్లు మావి, ఈ సిమెంటురోడ్డు మావి, ఈ పచ్చని పార్కులు మావి, ఈ రకరకాల రంగురంగుల రాత్రి ప్రకటనలు మావి, ఈ ఎయిర్‌కండిషన్ సినిమాథియేటర్లు మావి. ఈ నవనాగరిక ప్రపంచంలో మాలాంటివారివి కానివి మరేముంటాయి!

సెకండ్‌షో సినిమానుంచి తిరిగి ఇంటికి చేరుకునేసరికి మాంచి వయసులో ఉన్నామేమో, మళ్ళీ నకనక లాడుతూ ఉంటుంది. కడుపులో. ఆ రోజుల్లో, అర్ధరాత్రివేళ, నేను పేరుకున్న నెయ్యి వేసుకోలేనని అమ్మ బొగ్గులకుంపటి వెలిగించి, నెయ్యి వెచ్చబెట్టేసరికి అరగంట దాటేది. ఏ ఆధునిక పరికరమూ లేకుండానే, ఏమీ చదువుకోని అమ్మలాంటివే అమ్మాశంలా చేసేదే. అన్నీ అమర్చుకున్న ఇంట్లో, అంత పెద్దచదువు చదువుకున్న సరోజలాంటి తెలివైన అమ్మాయికి రానివంటకం అంటూ ఉంటుందా! నేనిలా బట్టలు మార్చుకు వస్తానో లేదో — దూరంనుంచి చూస్తేనే నోరు ఊరిపోయేలా డైనింగ్ టేబిలు నింపెయ్యదూ! ఇక ఆ ఒంటిగంట రాత్రివేళ, ఎదురెదురుగా కూచుని, కబుర్లు చెప్పుకుంటూ, గల గల నవ్వుకుంటూ, కర కర ఏ అప్పడమో నవులుకుంటూ, తీరికగా హాయిగా... నెమ్మదిగా, నిశ్చింతగా...నిదానంగా, సరదాగా...

ఇక ఆ ఒంటి గంట రాత్రివేళ మొదలెట్టిన ఆ భోజన కార్యక్రమం పూర్తి అవడమంటూ లేదా ఏమిటి? అని ఎవరైనా నిలదీయడం అనవసరం. ఇంతకీ భోజనంతోనే ఆ రోజు కార్యక్రమం పూర్తి చెయ్యడం అతి దారుణం. ఇక తెల్లారి తొమ్మిది గంటలలోగా మమ్మల్నెవరైనా లేపడానికి సాహసించారో మెషిన్ గన్‌తో పేల్చెయ్యడానికైనా వెనుకాడను.

అందమైన ఆలోచనలతో కునుకు కరువైపోయి లేచి కూచున్నాను. దిక్కుమాలిన ఈ ఆరు నెలలూ ఎప్పటికి గడుస్తాయో!

'ఏ పెళ్ళి నడకలు మండిపోనూ, కాస్త గబ గబా తిరుగుదూ, గడియారమా!' అని వాల్ క్లాక్‌ని సంధలించబోయాను. 'నెల నెలా మీకు మాసికం పెట్టే సంగతి మేం ఎరుగుదుం గానీ, కేలండరుగారూ, మరింత త్వరగా ఆత్మహత్య చేసుకుందురూ!' అని వారినీ ప్రబోధించి చూశాను. ఊహుఁ ఎవరూ చెక్కు చెదరలేదు. మాయదారి కాలపురుషుడు, అడుగుదీసి అడుగు వెయ్యడం మానుకున్నట్టున్నాడు!

ఇక సరోజని చూడకుండా ఉండడం నాతరం కాదనిపించింది. ఈ ఏడాది సార్ధకమాక, మూఢమి వెళ్ళేక, ముహూర్తాలు కుదిరేక...మా నాన్న వాళ్ళ నాన్న ఏక మాటకి వచ్చేక...ఎక్కడ చెయ్యాలో నిశ్చయించుకున్నాక ... ఎవరెవర్ని పిలవాలో అనుకున్నాక...ఏ రకంగా శుభలేఖలు వెయ్యాలో నిర్ణయించుకున్నాక ... దిక్కుమాలిన తతంగాలు. అవన్నీ కట్టగట్టి మంటబెట్టి బూడిదచేసి ఆ బూడిదను పడుచువాళ్ళంతా కలసి ఆకాశంమీంచి సముద్రంలోకి జల్లే రోజు ఎప్పుడొస్తుందో!

ఇప్పటికి రెండేళ్ళు దాటింది, సరోజని కలుసుకుని. అసలు ఈ రెండేళ్ళూ మనిషిని చూడకుండా కేవలం ఊహలతో ఉత్తరాలతో ఎలా గడపగలిగేనో! ఇంకా ఎన్నెన్ని కొత్త కొత్త అందాలతో వెలిగిపోతోందో! ఇంత దగ్గరగా వచ్చేక ఓమారు వెళ్ళి చూసి రాకపోవడం కేవలం మూర్ఖత్వం. ముందు రోజే ఖబురు తెలిసింది, సరోజ ధాన్యం అమ్మించి డబ్బు పుచ్చుకోవడానికి వాళ్ళ స్వగ్రామం అనకాపల్లి వస్తోందని. ఆ ఊళ్ళోనే వాళ్ళ తల్లి తండ్రి ఇల్లుంది. ఆ మధ్య ఏదో ఆఫీసుకి అద్దెకిచ్చారు గాని ఇప్పుడది ఖాళీగానే ఉంది. సరోజ అక్కడ దిగుతుంది. ఆమెకేం లోపం? చిన్నప్పట్నుంచీ వాళ్ళింటిని కనిపెట్టుకుని రాజమ్మ అనే వంట మనిషి ఆమె



వదలక; కంటికి రెప్పలా కాపాడుతూ ఉంటుంది. అందుకే హైదరాబాదులో మెడిసిన్ చదువుతున్నా సరోజకి హాస్టలులో ఉండవలసిన అవసరం లేకపోయింది. చిక్కడపల్లిలో నూట్రూపాయలకి రెండు గదుల అద్దెకు తీసుకుని, రాజమ్మను పెట్టుకుని, రాణిలా వెలిగిపోతోంది. నే నంతదూరం హైదరాబాదు ఎలాగా వెళ్ళలేను. ఇంత దగ్గిరగా అవకాశాన్ని వచ్చినప్పుడయినా చూడకుండా ఉండగలనా ? మధురమైన ఆలోచనల సుగతలో ఎప్పుడో నిద్ర పట్టేసింది.

ఆ మర్నాడు గుడ్ ఫ్రైడే. ఆఫీసుకు శలవు. శనివారం శలవు పెడితే మూడ్రోజులు కలసి వస్తుంది. శలవు చీటీ పంపించి ఎక్స్‌ప్రెస్ అందుకున్నాను. తీరా ఆ ఊరు చేరుకున్నాకగాని ఎక్కడ దిగాలో ఆలోచించలేదు. ఎంత దూరపు వరస అయినా పని గట్టుకు పరిశీలిస్తే సరోజ వరసకి నాకు మరదలని తేలుతుంది. మరి వాళ్ళ తాతగారు మా తాతగారు కాకపోతారా? సరాసరి ఆ యింటికే వెళ్ళొచ్చు. మా అమ్మ ఉన్నప్పుడు ఆవిడ పాటు ఎన్నోసార్లు, వెళ్ళేను కూడా. కాని ఏంత కాదనుకున్నా ఇప్పుడు నా హోదా పెళ్ళికొడుకు హోదాకదా! అక్కడికే వెళ్ళడం అంతగా మనస్కరించ లేదు. ఏదైనా మంచి హోటల్లో దిగుదాం అని వెదుకుతూంటే—నాతో చిన్నప్పుడు గంగా రామయ్య మేష్టారి దగ్గిర ప్రైవేటు పెట్టించుకొన్న సుధాకరం కనిపించాడు. నేను మొదట్లో పోల్చనే లేదు. అక్కడి కాలేజీలో ఫిజిక్స్ డిమాన్‌స్ట్రేటరుగా ఉంటున్నాట్ట. గబగబ అన్నీ చెప్పి, నా చేతిలోంచి సూట్‌కేస్ లాక్కుని, సైకిల్ రిక్షా మాట్లాడి వాళ్ళింటికి తీసుకు పోయాడు. పెళ్ళాం పుట్టింటికి వెళ్ళిందట. తల్లి వుంది. ఏవో చిన్న చదువులు చదువుతున్న ఓ చెల్లెలూ తమ్ముడూ కూడా ఉన్నారు. ఆ తల్లి ఆదరణా అభిమానమూ చూస్తూ ఉంటే మళ్ళీ మా అమ్మ గుర్తుకొచ్చింది.

ఆ రోజు వాళ్ళ కాలేజీకి కూడా శలవే యినా ఏవో ప్రాక్టికల్ క్లాసులున్నాయట ...కరం వెదుతూ నన్నూ రమ్మని కూచు ...ం. కాలేజీ అంతా తిప్పి చూపించాడు. ...క్ చేత కాఫీ టిఫినూ తెప్పించాడు. ...ా మారానేమో గాని ఆ రోజు వాడూ నేనూ కలసి లాంతరు పట్టుకుని ట్యూషన్‌కి వెళ్తుంటే దార్లో కబుర్లు చెప్పినంత ఫ్రీగా ఇప్పుడూ చెబుతున్నాడు. ఏంతో సరదా వేసింది. వాడిని అడగకూడనిది లేదనీ, చెప్పకూడనిది లేదనీ అనిపించింది.

'నేనిందాక నీతో చెప్పినే ఏదో ఆఫీసు పనిమీద ఈ ఊరు వచ్చానని, అది అబద్ధంరా !' అన్నాను తల వంచుకుని.

'నే నిందాక నీతో చెప్పినే పెళ్ళాన్ని పుట్టింటికి పంపించానని, అదీ అబద్ధమేరా!' అన్నాడు నవ్వుతూ.

ఇంటికొస్తున్నప్పుడు దారిలో అన్నీ సంగతులూ చెప్పేడు. తనతో దెబ్బలాడి పెళ్ళాం పుట్టింటికి వెళ్ళిందిట. తన వాళ్ళ నెవర్నీ దగ్గిర ఉంచుకోవడం సీతారత్నానికి ససేమిరా కిట్టదట.

'అమ్మ పేర నాన్నగారు డిపాజిట్ చేసిన పదిహేను వేలకి వడ్డీ వస్తుంది. పిల్లలిద్దరి పేరా చెరో ఇల్లూ, అద్దెలు వస్తాయి. వాళ్ళకి నేనేం కానీ పెట్టక్కర్లేదు, వేరే పెడితే లోకం ఏమను కుంటుంది!' అంటాడు అతను.

'వాళ్ళను మనం దగ్గరుంచుకుంటే వాళ్ళ డబ్బు మనం తినేశామని లోకం అనుకుంటుంది, అందుకనే వాళ్ళ మా నాన్న వాళ్ళని బతకనిద్దురూ!' అంటుందిట అతని భార్యామణి.

'పైకి అలా అంటుందిగాని సీత కడుపులో ఆలోచన వేరు. మా అమ్మ తిన్నంత తిని, పారబోసినంత పారబోసి, పదిమందికి పెట్టే రకంరా. మా ఆవిడది స్వతహా బాగా జాగ్రత్తగా, పదిమాట్లు ఆలోచించి ఖర్చుపెట్టే రకం. మా టవరసకి 'అయిదుగురు మనుషులకి ఈ నీళ్ళ పాలు రెండు శేర్లు ఏం చాలుతాయి !' అంటుంది మా అమ్మ, 'ఉన్నవాళ్ళం చూస్తే మళ్ళీ అయిదుగురం. పాలకే డెబ్భై రూపాయలు అయిపోతే—ఏం పెద్ద జీతాలవాళ్ళమని. నెల పొడుగునా ఎలాగ్గా రావడానికి ?' అని విసుక్కుంటుంది సీత. ఇంట్లో దెబ్బలాట జరగనిరోజు లేదనుకో'.

అని పూర్తిచేశాడు సుధాకరం.

'అయితే ఏంచెయ్య దల్చుకున్నావు నువ్వు ?'

'ఇదివరకు ఏమీ తోచేదికాదు...ఈసారి సీత వెళ్ళిపోయిం దగ్గర్నుంచి తీవ్రంగా ఆలోచిస్తున్నాను. ఇంచుమించు ఓ నిర్ణయానికి వచ్చినట్టే'

'ఏమిటది?'

'ఏంలేదు. పిల్లల చదువులు ఇక్కడ బాగులేవని వంకపెట్టి మావాళ్ళ కుటుంబాన్ని విశాఖపట్నం పంపేస్తాను. నాకు వీలయినప్పుడల్లా చూసి వస్తూంటాను అన్నిటికన్న ముఖ్యం. సీత యీ రకంగా వాళ్ళవాళ్ళ ఇంటికెళ్ళి రావడం నాకిష్టంలేదు. వాళ్ళు బాగా నూరిపోసి మరింత మనసు విరిచేస్తున్నారు. అమ్మా తమ్ముడూ చెల్లెలు వీళ్ళు నాకు ముఖ్యమే! అలాగని సీతని మరింతగా పైదాన్ని చేసుకోలేనుగద !' సుధాకరం సమస్యా, వాడు దాన్ని ధైర్యంగా ఎదుర్కొని పరిష్కరించాలని సిద్ధం చేసుకున్న పద్ధతీ —నాకు వాణ్ణి మరింత దగ్గరగా చేశాయి.

'ఒక్కొక్కళ్ళ ఇంట్లో పెంపకాన్నిబట్టి ఆర్థికమైన ఇబ్బందుల్నిబట్టి ఆడవాళ్ళ మనస్తత్వాలు అలా తయారవుతూ ఉంటాయి. తొందరపడి వాళ్ళనే తప్పు బట్టటం న్యాయం కాదు' అన్నాను వాడి కేదో హితవు కలిగించాలని. కాని వాడికవి అహితవుగా ఉన్నాయని ముడుచుకు పోయిన వాడి మొహమే చెబుతోంది.

'అలా అంటే నేను బాధపడకనే పోదును. మా మావగారికి సీతా వీళ్ళ అక్కా ఇద్దరే సంతానం. వీళ్ళ పెళ్ళిళ్ళకి పసుపుగా కుంకానికీ ఇచ్చిన అయిదేసి ఎకరాల చెరుకు తోటే కాక ఆయన తదనంతరం ఏభై యెకరాల మాగాణీ, మూడు డాబా యిళ్ళూ, అన్నీ వీళ్ళవే!'

ఇక వీడి భార్య ప్రవర్తనని వ్యాఖ్యానించక అక్కడితో ఆపు చెయ్యడం మంచిదేమో ననిపించింది. నేనేదో అనేలోగా వాడే అనేశాడు 'అందం, ఆస్తి, చదువూ...మనం చేసుకోబోయే అమ్మాయిల నుంచి ఇవే ఆశించి ఇంకేం కావాలని అనుకుంటే వాలా పొర్పాటు పడడం తప్పదు ... అదేమిట్రా ఉన్నట్టుండి ఒక్కసారి అలా అయిపోయావ్?'

'ఏం లేదు, ఏం లేదు, ఏదో జ్ఞాపకానికి వచ్చి...' అని తప్పించుకోబోయాను. అందం, ఆస్తి, చదువూ......నాకు తెలిసి

నంతవరకు సరోజ లక్షణాలు. సాధారణంగా వధూవరులు ఒకర్నిగురించి ఒకరు తెలుసుకొనేవి, మనసంఘమర్యాద ననుసరించి తెలుసుకోడనికి వీలైనవీ ఇంతమాత్రమే... ఇంతకంటె లోపలదూరి చూడడం సాధ్యమా? ఔదార్యమూ, మానవత్వమూ అనేవి ఉన్నాయోలేవో అని సరోజగురించి నేనేకాదు, నాగురించి సరోజ అనుమానించవచ్చు మరి! 'సరే ... నీమనసులోనిదేమిటో సమయం వచ్చినప్పుడే చెబుదువుగాని...పోనీ ఇదైనా చెబుతావా? ఇందాక ఆఫీసుపనిమీద రావడం అబద్ధమన్నావే...' అడగనే అడిగేశాడు.

'అలాగే చెబుతాలే...తలనొప్పిగా ఉంది... వోగడీ ఆగు...'

సమయానికి మాటమార్చి, మరో పావుగంటపోయాక నెమ్మదిగా చెప్పేను... ఇలా నో అమ్మాయి నాకు స్థిరమైందనీ, వోసారి కలుసుకుందామని వచ్చాననీ'...వాడు పకపక నవ్వుతూ అన్నాడు.

'ఓరి భలేవాడివే! మీవాళ్ళ ఇల్లు ఎక్కడా, నరసింగరావు పేటలో కదూ! అదెక్కడో దూరంగాలేదూ... మా పెరటి తలుపు ఎదురింటికి నాలుగోకొంపే. ఇది వరకు వచ్చానన్నావు, భలేగా జ్ఞాపకం ఉంచుకున్నావే గురిని! ఇంతమంచి కబురు కడుపులో దాచుకుని ఇంత ఆలశ్యంగా బయట పెడతావ్, ఏస్పెంచేస్తే పాపం

# అమ్మా, ఆకలేస్తోందే!

ఉందీ? పదపద... క్యాలిటీ ఐస్‌క్రీమ్‌లో ఏదో అయిదురూపాయల రకం వచ్చిందిట' అది తినిపిస్తేగాని నాకోపం చల్లారదు...'

సహృదయుడైన మిత్రుడి సరస సల్లాపాల చిరుగాలులు నా మనోగగనంలోకి కమ్ముకు వస్తున్న అనుమాన మేఘాల్ని చిందరవందర చేసేశాయి. ఇంటికి వెళ్ళి వెళ్ళగానే వాళ్ళ తమ్ముణ్ణి పరిగెత్తించి వాకబు చేయించాడు. నాకు అందిన భోగట్టా కరెక్టే. రాజమ్మా, సరోజా రెండు రోజుల క్రిందటే అనకాపల్లి వచ్చేరుట. ఆ రోజు పొద్దుట భోజనాలు అవగానే రిక్షా మీద వాళ్ళ పొలాలున్న గ్రామానికి, అక్కడికి అయిదు మైళ్ళు వెళ్ళేరుట. ఆ రాత్రి కరణంగారింట్లో ఉండిపోయి, అన్ని పనులు పూర్తి అయిపోతే మర్నాడు మధ్యాహ్నానికి అనకాపల్లి చేరుకుంటారుట. అదృష్టవశాత్తూ ఆ మర్నాడు పున్నమి. ఆ రాత్రికేనా సరోజ ఇల్లు చేరుకోదా? ఆ చల్లని వెన్నెల పున్నమివేళ ఆ సంస్కార సౌందర్యరాశితో మనస్సు విప్పి మధుర మధురంగా మాట్లాడుకోడానికి ఒక్క పది నిమిషాలు ఈ జన్మకి చాలవా!

శనివారం సాయంకాలం వాళ్ళు తిరిగొచ్చారని తెలిసిందగ్గర్నుంచీ నా ఆరాటానికి అంతు లేకపోయింది.




'ఇంకా ఆలోచిస్తావేం, ట్రిమ్‌గా ముస్తాబై వెంటనే బయల్దేరక?' అన్నాడు సుధాకరం.

'అలాగే... ఇంకా ఇప్పుడేగా వచ్చారని తెలిసింది! అయిదు మైళ్ళు ఆ నాటు రోడ్డుని ఆడకూతుళ్ళు వెళ్ళొచ్చారంటే అది సామాన్యమైన విషయం కాదు, కొంచెం విశ్రాంతి తీసుకోనీ...చల్లబడ్డాక దీపాలు పెట్టేక, ఏ ఏనిమిదిన్నరకో బయల్దేరదాంలే, ఎక్కడేగదా ?'

'బయల్దేరదాం!? నేనుకూడా రావాలాయేం కొంపతీసి ?'

'పోనీ రారా ఏం పోయింది. మా సరోజని నీకు పరిచయం చేస్తాను.'

'భలేవాడివిరా ! ఇంతధైర్యం. చొరవా గల మగమహారాజువి ఒక్కణ్ణించి ఏమంటూ వచ్చావురా తండ్రీ !' అంటూ వెక్కిరించాడు వాడు. నిజానికి వీళ్ళందరూ —అంటే : సుధాకరం, వీళ్ళ అమ్మా, తమ్ముడూ, చెల్లెలూ — అటు వైపు రాజమ్మా. వాళ్ళ మొగసాయంకోసం కరణంగారింటినుంచి వెంటబెట్టుకు వచ్చిన పాలికాపు లచ్చన్నా ... వీళ్ళందరూ ఉండబట్టే నాకు లేనిపోని సిగ్గూ, మొహమాటం కలుగుతున్నాయి — అనిపించింది. నేనూ, సరోజా మేమిద్దరమే ఉంటే !

తీరా మేము బయల్దేరి ఆ రాత్రివేళ ఆ ఇంటికి వెళ్ళేసరికి నాకు ఎదురైన సంఘటన నేను కలలో కూడా ఊహించి ఎరుగనిది !

మేడమీది గదిలో సరోజా రాజమ్మా పడుకున్నట్టున్నారు. పాత సీలింగ్ ఫేన్ మంచి కండిషన్‌లో లేనట్టుంది — పెద్ద చప్పుడు క్రిందకి వినబడుతోంది. వీధిగదిలో (ఎవరో) కుర్చీలో కూర్చుని ఉన్నట్టు కనిపించింది— కిటికీలో మసిబారిపోయిన చిన్న లాంతరు వెలుగులో.

'ఎవరది, ఇలా రండి బాబూ!' అని ఆయన కేకేశాడు.

మేం ఇద్దరం అటువైపు వెళ్ళేం... ఆయాసపడుతూ, ఆయన అడిగాడు:

'నువ్వు రవణమ్మ రెండోకొడుకవి కదూ! చిట్టిపెళ్ళికి వచ్చావుకదూ మీ అమ్మతో, అప్పుడు చూశాను నిన్ను... నాపేరు సుబ్బరామయ్య నేనెవరో నోలా చెబితే నీకు బోధపడుతుంది. సరోజకి

స్వయంగా పెద్ద మేనమామని నేను. అన్నట్టు వీకూ న రో జ కి నిశ్చయముయిందటగా! చెల్లెమ్మ రాసింది. బాగుంది నాయనా! ఏం పనిమీద వచ్చావు ఇటు వైపు?'

'ఆఫీసు ఇనస్పెక్షన్ పనిమీద వచ్చా నండి...ఇదిగో ఇతను నా స్నేహితుడు సుధాకరమని ఇక్కడే కాలేజీలో పనిచేస్తు న్నాడ ...వీరి ంట్లో దిగేను...ఇలా మన వాళ్లు వచ్చారని తెలిసి...'

'బాగుందిబాబూ...ముహూర్తాలు పెట్టు కున్నారా ?'

ఇంకా లేదన్నట్టు నేను తల ఊపు తుండగా సుధాకరం అడిగాడు.

'అదేమిటండీ ఫేను తిరుగుతున్నట్టు పైన అంత చప్పుడవుతోంది మరి ఈ గదిలో కరెంటులేదా ?'

'అన్నట్టు ఈ ఇల్లు మీదేకదూ బాబాయ్?' అని నేనూ మాట కలిపేను.

'చెప్పాలంటే ఈ ఇంటి బేరంకోసమే నే వచ్చింది. ఇల్లు ఇంత అధ్వాన్న పరిస్థితిలో ఉందని నాకు తెలీదు. ఒక్క వంటగదిలోనూ పైన మేడమీద గదిలోనూ తప్ప వైరింగ్ అంతా చెడిపోయి ఉంది. ఏదైనా దగ్గిరుండి చూసుకోకపోతే ఇంతే అనుకోండి...తమ్ము ళ్లెవరికీ అసలు పట్టదు. ఇల్లుఅమ్మి సొమ్ము పంపితే అందుకోడానికి మాత్రం సిద్ధం... ఆఖరికి ఇంత జబ్బుమనిషినీ ఆ కాన్పూరు నుంచి, రెండు రైళ్ళు మారి...అమ్మ... అయ్యో...' దగ్గూ, గుర గురా ఆయన్ని ఉండనివ్వలేదు. ఈ జబ్బు, దీని వ్యవహారం నాకు పూర్తిగా తెలుసు. ఈ ఆస్త్మా తోనే మా అమ్మ తీసుకుని తీసుకుని ప్రాణాలు విడిచింది. లాంతరు వత్తి పెద్దది చేసి సుబ్బరామయ్యగారి దగ్గిరపెట్టి చూస్తే గుండె జల్లుమంది. మొండి మనిషి, ఇంతసేపూ ఎలా మాట్లాడగలిగేడో ! గుండెలు ఎలా ఎగిరెగిరి పడుతున్నాయో!

'ఎటాక్ బాగా ఉధృతంగా వచ్చి నట్టుంది. వెంటనే ఇంజక్షన్ పడితేగాని నమ్మకోదు... సుధాకరం, నీకు తెలిసిన డాక్టరెవరైనా దగ్గిర్తో...'

వాడు బయల్దేరబోతూంటే ఆయన వారించారు. పక్కనున్న లెదర్ బేగ్ చూసించి అందులో మాత్ర ఉందని, అదీ మంచినీళ్ళు ఇమ్మని సంజ్ఞ చేశారు. నే నలాగే చేశాను. మాత్ర వేసుకున్న పది పదిహేను నిమిషాలకు బాగా తగ్గినట్టు అనిపించింది.

'వీళ్ళిలా వస్తున్నారని చెల్లెమ్మ టెలి గ్రాము ఇచ్చింది. అందుకే ఏమైతే అయిం దని బయలుదేరేను. ఈ దిక్కుమాలిన రోగానికి హోటలు భోజనం పడదుగా! రైల్లోనే ఆరంభించింది. దిగేసరికి ఎలా ఉండాలో అలా ఉంది. తీరా నేను వచ్చే సరికి వీళ్ళు లేరు. వాళ్ళా వచ్చి వంట మొదలు

పెట్టి అన్నీ చేసేసరికి నేను తినే స్థితిలో లేను. ఇంత చికాగ్గా ఉన్నప్పుడు అన్నం తింటే ఇంకేమైనా ఉందా! వద్దన్నాను...

'ఇంకా ఇప్పుడేం చూశారు? డాక్టరొచ్చి ఇంజక్షనిచ్చి వెళ్ళేడు. గాబట్టి గాని.'

'ఇంజక్షను పుచ్చుకున్నారూ అప్పుడే? పుచ్చుకున్నాకే ఇంత బాగుందా?'

'ఏమనుకున్నారు మరి? నిలయ విద్వాంసులు అంత సులువుగా వదుల్తారా?' అంటూ అతను నవ్వేడు. నవ్వుతో మళ్ళీ ఆయాసమొచ్చింది. ఈసారి జంత్ర సమ్మేళనం మరింత స్పష్టంగా వినిపించింది.

మరో మాత్ర వేసుకున్నాక కొంచెం తగ్గింది.

'వాళ్ళప్పుడే పడుకున్నారో ఏమో! వెళ్ళి చూసి రండి...ఇంతకీ మీరిలా వస్తున్నట్టు సరోజకి తెలిసినట్టు లేదే!'

'అవునండీ... తీరా బయల్దేరదాకా నాకే తెలీదూ...మీకిలా ఉన్నప్పుడు ఈ రాత్రివేళ పైకి వెళ్ళి పలకరించకపోతే యేం లెండి. రేప్పొద్దున్న వస్తాంగా...'

'అయ్యో నా కోసం వింతకని కనిపెట్టుకుంటారు, మీ పనుల్ని మానుకుని? ఇది నాకైతే మామూలేగాని నాకు చేసేవాళ్ళకి మాత్రం అవస్థే... అమ్మో...బోబోయ్... మంట... ఈ దిక్కుమాలిన మాత్రలు చాలా పవర్‌ఫుల్‌వి. బాధ భరించలేక రెండు మింగేశాను. పొరపాటు పని చేశాను...లోపల దహించేస్తోంది... ఏలాగ, ఏం దారి? భగవంతుడా...'

పాపం ఆయన బాధ చూడలేకపోయాను. డాక్టరు కోసం మళ్ళీ పరిగెత్తబోతే మళ్ళీ వారించాడు.

'చూడుబాబూ ... కొంచెం మేడమీదకి కబురంపించు ... మెట్లుమీద పడుకుని ఉంటాడు లచ్చన్న...వాణ్ణి కేకేస్తే రాజమ్మని లేపుకొస్తాడు. ఇంత అన్నం ఉందేమో, కొంచెం మజ్జిగపోసి మెత్తగా కలిపి తెచ్చిపెట్టమను. అది తాగితే కడుపులోమంట కొంచెం చల్లారుతుందేమో...' సుధాకరాన్ని సుబ్బరామయ్య గారికి సాయంగా ఉంచి బ్యాటరీలైటు ...తో లోపలికి వెళ్లేను. మేడమెట్లపై

## అమ్మా. ఆకలేస్తోందే!

పెద్దమెట్లుమీద పడుకున్న లచ్చన్నని లేపేను. తలదగ్గిరున్న చేపాటి కర్రను చటుక్కున అందుకుని లేచి కూచున్నాడు వాడు. సుబ్బరామయ్యగారి చుట్టంగా నన్ను వాడికి పరిచయం చేసుకున్నాను. సంగతి చెప్పి రాజమ్మని లేపి తీసుకు రమ్మన్నాను...వాడు పడుకున్న చోటి నుంచి మేడమీద గదికి దారితీసే వరండా కాస్త పెద్దదీ. వాడు వెళ్ళిన రెండునిమిషాలయినా ఇంకా రాలేదేమీ అని గదిదగ్గిర కెళ్ళేను. అప్పుడు నాకు వినిపించిన మాటలు నేను జన్మలో మరచిపోలేనివి.

'చుట్టమో, దెయ్యమో...నిన్ను లేపిన వాడికి బుద్ధిలేకపోతే, పోయింది నువ్వేమంటూ వచ్చావు లచ్చన్నా! కరణంగారు నీతో ఏంచెప్పేరు, ఇంతడబ్బుతో ఉన్నాం గనా ఆడకూతుళ్ళం, నవ్వలా కదిలి వచ్చేస్తే మాగతేంకాను? అయినా ఈ అమ్మకి మతిసుతిలేదు. పెద్ద మామయ్యకి పెళ్ళిగాం ఏందుకవ్వాలి? దిక్కుమాలిన రోగం కాదుగాని మధ్యని మమ్మల్ని చంపే

### నిర్మల దీపావళి

అవసరాల చీకట్లు దాటడానికి
అభిమానపు దీపాలు వెలిగించకు
విగళత్ స్నేహాన్ని కప్పడానికి
కృతకజలం పోయకు
వెలుగు నిజం చెబుతుంది.
వెలుతురు బండారం బయట పెడుతుంది.
పాపంచేసిన చేతులు—వెలిగించినదీపం
జ్వలించి
ఆచేతుల్నే కాల్చివేయగలదు
స్నేహం అనిచెప్పి మోసంచేయజూస్తే
దీపం వెలగనే వెలుగదు
అందుకే
నీవు చేసే దీపావళిలో
సుధా స్నేహంతో గుండె వెలిగించు
నైర్మల్యం వెలుగులు పంచు
నిర్మల దీపావళి జరిపించు.

—సుధామ

న్నున్నాడు బాబూ ... పడుకున్నారు వింత తలుపుకొట్టినా లేవలేదని చెప్పేద్దా లచ్చన్నా'

'ఉండు లచ్చన్నా...మరోమారు ఆలోచించుకోనీ...చూడమ్మా సరోజా ... ఏదిరైనా ఏమనుకుంటారో ... పోనీ మీ అమ్మాయి ఎలా జరిగిందని తెలుస్తే ఏమంటారో అద్దైనా ఆలోచిద్దాం. మీ మామయ్యమీద సానుభూతితోకాదు సుమా నేను మాటాడుతూంట — ఇందాక తినవయ్యా (బ్రాహ్మడా అంటే మనతో ఏ చావగూడదూ, ఈ అపరాత్రివేళ నన్నిలా కాల్చుకు తినకపోతే! ఆ రిక్షాలో కూచోలేక గుళ్ళు కదిలిపోయాయి. ఇప్పుడు లేచి నేనెలాగా వండి వార్చేది లేదు...ఇందాకటి పాడిమెతుకులే ఇన్ని మిగిలినట్టు జ్ఞాపకం .. ఇన్ని మజ్జిగ చుక్కలు తడిపి, పారేసి వస్తానుండు ... అనవసరంగా నిందైనా తప్పుతుంది.'

'రాజమ్మా! ఏళ్ళు ముదిరినకొద్దీ నీకు బుద్ధికూడా పెడదోవ పడుతున్నట్టుందే! అక్కడికి నువ్వేమి మావయ్యకి ఆపదలో ఆదుకున్నదానివీ, నేనేమో పెద్దాన్నీనా...గడికి కావాలంటాడు గడికి వద్దంటాడు మావయ్య సంగతి నువ్వే మెరుగుదువు? అందులో ఆ వంటాది తాళం ఏ ఇక్ష్వాకులనాటిదో వో పట్టాన వచ్చిచావదు. నువ్వెళ్ళి కింద ఉంచుంటావు. నేనేమో ఇన్నివేలతో బిక్కుబిక్కుమంటూ ఒక్కర్తెనీ ఇక్కడ అఘోరిస్తాను. చాల్లే పమ్మా, చెప్పేవ్? లచ్చన్నా ఏంచెప్పేను నీకు? వింత పిలిచినా పలకలేదని చెప్పేయ్ ...వెళ్ళు'

లచ్చన్నకంటె నేనే ముందుగా పెద్ద మెట్లు దగ్గిరచేరి. రాగానే వాడికబురు అందుకున్నాను. 'ఫేను చప్పుడులో కాబోలు వింతపిలిచినా వాళ్ళు లేవలేదు బాబాయ్!' అని చెప్పేను. సుధాకరం పరుగుపరుగున ఇంటికివెళ్ళి, వాళ్ళన్నని లేపి సావుగంటు దాటకుండా పెద్దన్నేడు మజ్జిగన్నంతో సిద్ధమయాడు.

ముందురోజు రాత్రి సరోజను కలుసుకోలేదనే నిహతాతో నిద్రపట్టలేదు. ఆ రోజురాత్రి సరోజను తెలుసుకున్నాననే

బాధతో నిద్రపట్టలేదు. నిద్ర పట్టడం ఎందుకు ? ఇప్పటికైనా మేలుకోకలిగావని తృప్తిపడక బాధ దేనికి, సంతోషించక సరోజ సుధాకరం ఎంత బతిమాలినా గుప్పెడన్నం తినలేక పోయాను. రాత్రివేళ ఆకలితో బాధతో నిద్రపట్టక లేచి కూచుని మంచినీళ్ళు తాగుతుంటే మళ్ళీ అమ్మ జ్ఞాపకం వచ్చింది. అమ్మకి సంబంధించిన మధురమైన సంఘటన ఒకటి గుర్తుకొచ్చింది.

ఒకసారి మా యింట్లో పాలుపితికే అప్పలస్వామి, పెళ్ళాం పురుడు అయితే పాతబియ్యం అమ్మని అడగడానికి వచ్చాడు. కూడా పెద్దకొడుకు నూకయ్యగాణ్ణి, అప్పటికి ఏనిమిదేళ్ళవాడు, వాణ్ణి తీసుకొచ్చేడు. అమ్మ అప్పలస్వామి పైచెంగులో బియ్యం పోసి 'ఏడెవర్రా మెరిసే కళ్ళు నీడూను ?' అంటూ వాడి గుండుమీద ఒకటి వాయించి మిఠాయి ఉండ ఒకటి చేతిలో పెట్టింది. అమ్మ హృదయంలాగే ఆ మిఠాయి ఉండ చాలా పెద్దది. రెండు చేతుల్తోనూ కష్టపడి మోసుకెళ్ళేడు నూకయ్యగాడు. ఆ తరవాత నూకయ్య చాలాసార్లు మా ఇంటికి వచ్చాడు. ఎప్పుడొచ్చినా 'ఇంత మిఠాయి ఉండ ఇచ్చిన అమ్మగారి కోసం వాడి మెరుస్తున్న కళ్ళు ఆరా తీసేవి. వాడొక్కడే కాదు, లోకంలో ఉన్నవాళ్ళంతా ఆదరణా ఔదార్యం — అవేవి ఎక్కడ దొరుకుతాయో అని వెతుకుతూ ఉంటారు. మనిషిగా అలాంటి వాటికోసం వెతకడం నా సహజ ధర్మం. అలాగే అలాంటివి దొరకని చోటునుంచి తప్పుకోడం కూడా అవసరం. సుధాకరం వాళ్ళ వాళ్ళలా సరోజ నా వాళ్ళెవరికీ చెయ్యవలసిన అవసరం లేక పోవచ్చు. కాని సహృదయం లోపించిన సరోజతో నేనే క్షణం గడపలేకపోవచ్చు. అంత అందమైనదీ చదువుకున్నదీ ఆస్తి ఉన్నదీ మరొకర్తి దొరక్కపోవచ్చు. కాని అన్నిటినీ మించిన మానవత్వం ఉన్నది మరొకర్తి దొరకొచ్చు. లోకం గొడ్డుపోలేదు. పదునెక్కిన మనస్సుతో సేద తీరిన హృదయంతో ఆదమరిచి నిద్రపోయాను. ●

# స్నాననియమం



బులుసు వేంకటరమణయ్య. ధర్మపథం

✷ మనవారు ఏ నియమాలను ఏర్పరచినా, ఆ నియమాల వెనక పారమార్థికంగా కాకుండా మానవ సుఖజీవనానికి అనువైన రహస్యం ఒకటి వుండనే ఉంటుంది. ఉదాహరణకు స్నాన విషయాన్ని తీసుకోవచ్చును.

మనం ఏప్పుడు పడితే అప్పుడు స్నానం చెయ్యకూడదు (ఇక్కడ స్నానమంటే తలకు స్నానమని గ్రహించాలి) ఆ నియమం ఇలా ఉన్నది—

'నస్నాన మాచరేద్భుక్త్వా
నాతురో న మహానిశి'
నవాసోభిః సహాజస్రం
నా విజ్ఞాతే జలశయే'

'భోజనం చేసినతర్వాత స్నానం చెయ్యకూడదు. ఆవిధంగా రోగంతో ఉన్నప్పుడు గాని, అర్ధరాత్రి సమయంలోగాని, దుస్తులను ధరించిగాని స్నానం చెయ్యకూడదు. తనకు తెలియని కొలనులో దిగి స్నానం చెయ్యడంకూడా ఉచితం కాదు' అని దీని అభిప్రాయం.

(1) స్నానంచేసి, పరిశుద్ధంగా ఉన్న తర్వాత భోజనం చెయ్యాలి. అంతేగాని అశుభ్రంగా వుండి, భోజనం చెయ్యడమూ, భోజనానంతరం స్నానం చెయ్యడమూ సరియైన పద్ధతి కాదు. అది అనారోగ్యకరం! అశుభ్రంగా ఉండి భోజనం చెయ్యడం, భోజనం చేసినవారికి అసహ్యమని తోచకమానదు. ఇతరులసహ్యించుకోవడంలో వింత లేదు.

(2) జ్వరంతోఉన్నపుడు స్నానం చెయ్యకూడదు. అట్టి స్నానం అనారోగ్యానికి కారణమవుతుంది. రోగాన్ని వృద్ధిచేస్తుంది అందువల్ల—శరీరంలో ఏమాత్రం సుస్తీగా ఉన్నా స్నానంకూడదు. వైద్యులు అట్టి సమయంలో స్నానం చెయ్యరాదని మందలించడం అందరూ ఎరిగినదే!

మిట్ట మధ్యాహ్న సమయంలో స్నానం చేసినా చెయ్యవచ్చునుగాని అర్ధరాత్రి సమయంలో స్నానం ఎంతమాత్రమూ కూడదు. వేళ తక్కువగా ఉన్న జబ్బులు రాత్రి సమయంలో ఎక్కువ కావడం సహజం! అనారోగ్యం కలిగిస్తుంది కాబట్టి అర్ధరాత్రి స్నానం తగదు.

స్నానం చేసేటప్పుడు కట్టుకున్న బట్ట తప్ప మరేదీ ధరించి వుండకూడదు. దుస్తులతో స్నానం చేస్తే వాటనీరు శరీరంలో ఇంకి జబ్బుచేస్తుంది.

ఈవిధంగా తగని సమయాల్లోనూ తగని రీతిని చేసే స్నానం అనారోగ్యకరం. తనకు పరిచయంలేని— అంటే అందులో అపాయకరమైన జంతువులున్నదీ లేనిదీ బురద ఉన్నదీ లేనిదీ తెలియని చెరువులో స్నానానికి దిగితే ప్రాణాపాయం సంభవించవచ్చు. అందువల్ల ఏట్టి ప్రమాదం ఉండదని తెలిసిన చెరువులో దిగి స్నానం చెయ్యడం మేలు. ●

# సీరియల్



## జరిగిన కథ

అప్పుడే బి. ఏ. పరీక్షలు రాసిన కృష్ణవేణి తాతయ్య శాస్త్రిగారి టెలిగ్రాము చూచి బయలు దేరి వస్తుంది. రాజశేఖరంతో పెండ్లి చూపులు తర్వాత వివాహం జరుగుతుంది. రాజశేఖరం చెల్లెలు మీనాక్షి మహా మూఢాచార పరాయణలు అయిన అత్తమామల ఆరళ్లు పడలేకపోతుంటుంది. భర్త శంకరం ఆమె కన్నీరు చూడలేని పిరికివాడు. తప్పించుకుని వచ్చిన ఒక స్త్రీకి మధు తన గదిలో ఆశ్రయం యిస్తాడు. ఆమె రాణి అనే ఒక వేశ్య. రాణి ఎక్కడికో వెళ్లిపోయింది. ఆమె ఎడబాటుని సహించలేకపోయాడు మధు.

## 5

రాజశేఖరం ఇంటికి హుషారుగా వచ్చాడు.

'ఏమిటో విశేషం? దొరగారు ఉత్సాహంగా వున్నారు?' అంది కృష్ణవేణి ఫ్లాస్కులోని కాఫీ కప్పులో పోసి యిస్తూ.

'ముందు ఇది. తరువాత కాఫీ.' అన్నాడు ఎర్రగులాబి పూలవంటి పెదవుల మీద ముద్దుపెట్టుకుని.

'ఏమిటండీ మీరు మరీను. రోజురోజుకి చిన్నపిల్లాడైపోతున్నారు' అంది చిరుకోపంతో.

'నీ పక్కనుంటే కాలం వెనక్కి నడుస్తుంది. వయస్సు తగ్గిపోతుంది. పూల పరిమళంలా అవుతుంది జీవితం.'

'కవిత్వం చాలు. అసలు కథ చెప్పరండి.'

'అలా అయితే ఎలా? అంత శుభవార్త ఊరికే చెప్పేస్తానా?' మెల్లగా ఒళ్లో కూర్చొని, గడ్డం నీ వైపుకు త్రిప్పుకుని 'నాథా, ఆ శుభవార్త చెప్పరూ?' అని అడిగితే—'

'ఛ్ఛావ్, ఛ్ఛావ్, అలా అయితే మీదగ్గరే వుంచుకోండి' అంది మూతి బిగించి.

'హోల్డాన్. రాణికి కోపం వచ్చింది. కోపం వస్తే రాణి ముఖం కందిపోయి ఎర్రమందార అవుతుంది. ఆ పువ్వంటే నాకెంతో యిష్టం' అన్నాడు భార్యను దగ్గరకు లాక్కుని.

కృష్ణవేణి తప్పించుకోలేక వూరుకుంది.

'వదలండి'

'నిజంగా వదలనా.'

'ఊఁ!'

'పోగలవా?'

'ఊహూఁ! నేనేం పోవాలనుకోటం లేదు.' అంది అతని భుజంమీద తల ఆనించి.

రాజశేఖరం చిన్నగా నవ్వాడు.

'ఇంతకీ శుభవార్త ఏమిటి?'

'ఆశ. నాకేదైనా ప్రెజంటు ఇవ్వకుండానే? చెప్పేస్తానా?'

'నా సర్వస్వం మీరు. ఇంకా మీకేమివ్వగలను?'

'నన్నే నాకివ్వు.'

'మిమ్మల్ని త్యాగం చేయగల శక్తి నాలో లేదు.'

'ఎందుకని?'

కృష్ణవేణి అతని గుండెల్లోకి ముఖం పెట్టి 'మీ ఆత్మతో పెనవేసుకున్న నా ఆత్మ వడగండి' అంది

అతను ఆనందం పట్టలేకపోయాడు.

'కృష్ణా! ఈ జీవితం కలలా తీయగా వుంది?' అన్నాడు.

కృష్ణవేణి పక్కున నవ్వింది.

'కల జీవితం కాదు. మనముందు ఎన్నో సమస్యలు. కళ్ళు తెరవండి.'

'జీవితాన్ని గురించి కల కనటం కూడ తప్పే నంటావా? అయినా నాకెందుకో అది శాశ్వతమే ననిపిస్తున్నది' అన్నాడు కాఫీ సిప్ చేస్తూ.

'అదే ఆశ. ముందా శుభవార్త ఏమిటో చెప్పండి.'

'మనం ట్రైనింగ్‌కు పోతున్నాం. ఆ తరువాత మా కంపెనీలో నో బ్రాంచికి మేనేజర్‌గా అవతరిస్తాం.'

కృష్ణవేణి ముఖం ప్రొద్దు తిరుగుడు పువ్వంత అయింది.

'నిజం'

'ఈ ముద్దుతోడు.'

'ఉండండి. అత్తగారితో చెప్పి వస్తాను. మీరూ రండి.'

కొడుకు కోడలు నవ్వుముఖాలతో రావటం చూసి 'సినిమాకా?' అంది తను నవ్వుతూ.

'మీ అబ్బాయికి ట్రైనింగ్‌కి రమ్మని వచ్చిందత్తయ్యా. ఆ తరువాత బ్రాంచికి మేనేజర్‌గా వేస్తారు' అంది కృష్ణవేణి.

'ఇదంతా నీ ప్రభావం. నువ్వు వచ్చావు వాడ్ని అదృష్టం వరించింది' అంది. కోడల్ని దగ్గరకు తీసుకుని.

'నాదేముంది. 'ఆమాటకొస్తే ఈ క్రెడిట్ మీనాక్షిదే. మీనాక్షి వచ్చాకనే ఈ వార్త తెలిసింది.' 'అని మీనాక్షిని ఒక్క క్షణం చూసి 'ఉహూఁ! ఈ క్రెడిట్ మీనాక్షిది కాదు' అంది.

మీనాక్షి ముఖం అంతలో మారిపోయింది.

రాజశేఖరం ఆశ్చర్యంగా భార్యని చూసి 'అయితే నాదే కావాలి. కష్టపడి పని చేసింది నేను. దీన్ని మరెవరికో అంట కట్టటం న్యాయంకాదు.' అన్నాడు.

కృష్ణవేణి తలతిప్పి 'మీది కూడా కాదు.' అంది.

'మరెవరిది?'

'ఇదుగో, ఈ కడుపులో వున్న మీ మేనల్లుడిది.'

మీనాక్షి ముఖం సిగ్గుతో ఎర్రబడి పోయింది.



'ఫో వదినా' అంది.

'అవును మీనా, ఇంతకీ మీ అబ్బాయి పేరు ఏం నిర్ణయం చేశారు?' అన్నాడు రాజశేఖరం నవ్వుతూ.

మీనాక్షి ఉడుక్కుంది.

'మాడమ్మా' అంటూ తల్లి ఒడిలో తల దాచుకుంది.

'అంతసిగ్గెందుకమ్మా, రేపు మీ వదిన మాత్రం కడుపుతో వుండదా? నువ్వు అందువుగానిలే;' అంది శాంతమ్మ కూతురి తలమీద ప్రేమగా రాస్తూ.

'నాకు మాత్రం ముందు కూతురే కావా' అన్నాడు భార్యని క్రీగంట చూస్తూ రాజశేఖరం,

కృష్ణవేణి రెండు మోకాళ్ళమీద తల పెట్టి కూర్చుంది

'సమాధానం చెప్పరేం?'

'ఎవర్నడుగుతావురా? పక్కనే వున్నది మీ ఆవిడ అడుగు.'

'అయితే మీనా, మీ అబ్బాయికి వీళ్ళ మ్మాయిని చేసుకుంటావు టే?'

'అంత అదృష్టమా అమ్మా?' అంది మీనాక్షి

'బాబ్బాబు, నీకు పుణ్యముంటుంది మా అల్లుడ్ని ఇప్పటి నుంచి మా ఇంట్లో పెట్టు. కాస్త మంచి చేసుకుంటాను.' అన్నాడు రాజశేఖరం.

'ఈ ఆనందం ఇంతకు ముందెప్పుడూ లే దెందుకని?'

మీనాక్షి గుండెలో తళుక్కున మెరుపు మెరిసింది

జీవితమం[illegible] గేసేనో?

'అన్నయ్య వదినలలా జీవించటం చేత కాదేమో తమకు?

వీళ్ళని చూస్తుంటే తనకే ఎంత తృప్తి!

మీనాక్షి కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

'ఏమిటి మీనాక్షి ఏడుస్తున్నావా? మనసు బాధ పెట్టుకోగూడదని డాక్టరు చెప్పలేదూ?' అంది కృష్ణవేణి

'లేదు వదినా, ఇది కన్నీరు కాదు ఆనంద బాష్పాలు. నాకసలు విలువే లేదనుకున్నాను, కాని వుందని నా విలువ ఈ ఇంట్లో గుర్తించబడింది.'

'ఛీ పిచ్చిదానా, విలువ మనిషి గర్భంలోనే వుండదమ్మా. కాని అలా గుర్తించక పోయినంత మాత్రాన కూడా దాని విలువ మాసిపోతుం దనుకోకు.'

[illegible] క్కడికి



అంటేనే భయం.'

కృష్ణవేణి చప్పున భర్తవంక చూసి 'అన్నట్లు నే చెప్పిన విషయం ఏం చేశారు?' అంది.

'శంకరం సంగతేనా?'

'ఊఁ!'

'రాణిగారు ఆజ్ఞాపించటం, ఈ దీనుడు కాదనటమూనా? గుండె లుండద్దూ? మీనాక్షి వదుగు. సరేనంటే అలాగే. రఘుని — రోజే కలిశాను.'

'ఏమిటన్నయ్యా?'

'మీ ఆయనకి ట్రాన్స్ఫర్. ఏం మీనాక్షీ. నీ కక్కడ సుఖం లేదు. మీకు ఊపిరాడదు. హాయిగా వచ్చినంతలో తిని శాంతిగా బ్రతకవచ్చు. మీ ఆయనవస్తారా? నీ కథంతా విన్నాక నాకీ ఆలోచన వచ్చింది.' అంది కృష్ణవేణి.

'నీకు పుణ్యముంటుంది. ఆ పని చేయించు' అంది మీనాక్షి.

'మీ అత్తగారు వాళ్ళు రారా మీతో?'

'వాళ్ళా? వాళ్ళకెన్ని పను లక్కడ? పసేమిరా కదలరు ఆ వూరినుంచి.'

'ఇంకేం. ఆ ప్రయత్నం చేస్తాను.'

'ఇంతకీ మీరు ఎప్పుడు వెళ్ళాలి?'

'ఇంకా అది తెలీలేదు. పదిహేనో తారీకు వెళ్ళాలేమో!'

'నేను వస్తాను' అంది కృష్ణవేణి.

'మరీ బాగుంది. పెళ్ళికి వెడుతూ పిల్లిని చంకన పెట్టుకుని వెళ్ళినట్లు?'

'అయితే నేను పిల్లినా?'

'పిల్లివి. పెద్ద పిల్లివి,

'పోనిండి. ఇంక అసలు పలకను.'

'వేణీ.'

కృష్ణవేణి మాట్లాడలేదు.

'రాణీ'

జవాబు లేదు.

'దేవీ'

'పలకను.'

'అయితే అబ్బాయి అక్కడ యెక్కడ వుండటం?'

'అదీ చూసుకోవాలి. అదే చెబుతుంటే వినిపించుకోదు నీ కోడలు.'

'ఎలా వినపడుతుంది? నేను పిల్లిని.'

రాజశేఖరం నవ్వి 'బాగా కోపం వచ్చినట్లుందే?' అన్నాడు.

'రాదూ మరి?' అంది కృష్ణవేణి.

## అమృతకలశం

'చస్తాం. అమ్మా యివ్వాళ నీ దగ్గరే పడుకుంటాను.' కృష్ణ ఆపుకోలేక ఫక్కున నవ్వేసింది.

'పోండి.'

'ఉండండ్రా మీ సోట్లాటలూ మీరూనూ, అయితే రాజా ఏం చేద్దామని నీ ఆలోచన?'

'ఏముందమ్మా. ఏదయినా హోటలు చూసుకుని—'

'హోటలెందుకురా? మన రంగనాథం మావయ్య అక్కడే వుంటాడు. నీ పెళ్ళికి కూడ వచ్చాడు.'

'ఆఁ! వాళ్ళింటి కెందుకులే.'

'నీ మొహం. ఆ హోటలు తిళ్ళు నీకు పడవు. అసలే నీ ఆరోగ్యం అంతంత మాత్రం. శుభ్రంగా వాళ్ళింటికి వెళ్ళు. అంతగా అయితే వచ్చేటప్పుడు వో రెండు వందలు ఇచ్చిరా.'

### చిట్కా స్వీట్స్

**సగ్గుబియ్యం లడ్డు**

సగ్గుబియ్యం నెయ్యిలోవేసి వేపి అరశాకు బియ్యపుపిండి కొబ్బరికోరు, పంచదారా బాగా కలియబెట్టి, యీ ముద్దలో వేచిన సగ్గుబియ్యం వేసి బాగా కలిపి ఉండలు కట్టుకోవాలి.

**సొగుసా పోళి**

అశాకు పచ్చిపిండి, కొబ్బరికోరు, అశాకు చెక్కెర, ఒక అశాకు పాలలో వేసి లకులు పాడిచేసి బాగాకలియపెట్టి పెజ్జప్పంలాగా తటి దోరగా కాల్చుకోవాలి.

**పరమపద చక్కరపొంగలు**

బియ్యము, పెసరపప్పు, ఎసరు పెట్టి వార్చుకోవాలి. పంచదార పాకం పట్టిదాన్లో యీ అన్నంవేసి నెయ్యివేసి బాగా కలియ బెట్టి, జీడిపప్పు, కలకండ ముక్కలు ఎండు ద్రాక్షలు వేసి దించాలి.

**టెంకాయ అమృతఫలం**

ఒక కొబ్బరికాయ, కేడు బియ్యం, వేసి బాగా రుబ్బి, పాలు తీసుకోవాలి. ఈ పాలలో చక్కెరవేసి చిన్న సెగమీదవేసి ఉడగనివ్వాలి. తరవాత అరిటాకుమీద ఇది బిళ్ళలుగ చిన్న గరిటెతో వేయాలి. కె. నా.

'ఆయన తీసుకోడు.'

'పోనీ బట్టలు కొనిపెట్టిరా.'

'వద్దు లేవమ్మా.'

'వద్దేమిట్రా? పరాయివాడా ఏమన్నానా? అవసరం వచ్చినప్పుడే బంధువులు.'

రాజశేఖరం ఇక తర్కించదలుచుకోలేదు.

'మూడ్నాళ్ళ లేవమ్మా. ఇంకా టైముందిగా.' అన్నాడు.

'చూడటము పెట్టటమూ— అమ్మాయి కృష్ణా, వో కార్డు తీసుకో తల్లీ. వో ఉత్తరం ముక్క రాసి పడేద్దాం' అంది శాంతమ్మ.

'నీ కెంత తోస్తే అంతే.' అన్నాడు రాజశేఖరం విసుగ్గా లేచిపోయి.

'చూశావమ్మా ఇదీ వరస. నీ కెందుకు నువ్వు ఉత్తరం రాయి. నే చెబుతాను.' అంది శాంతమ్మ.

కృష్ణవేణి నవ్వుకుని 'చెప్పండి' అంది.

పది రోజుల తరువాత రాజశేఖరం ట్రైనింగ్‌కు వెళ్ళాడు. రంగనాథం స్టేషనుకు వచ్చి ఇంటికి తీసుకెళ్ళాడు.

* * *

మొదట్లో రాజశేఖరానికి ఈ ఇంట్లో క్రొత్తగా వుండేది. రంగనాథం తన వాగ్ధరణితో బెరుకు పోగొట్టేశాడు. రంగనాథం చాల తమాషాగా మాట్లాడుతాడు. రాజశేఖరానికి రంగనాథం స్వభావం అర్థం కాలేదు. అతనేదో వ్యాపారం చేస్తాడని విన్నాడు. కాని అతను చేసే వ్యాపారం ఏమిటో రాజశేఖరానికి అంతుబట్టలేదు. రోజులో ఎక్కువ భాగం ఇంట్లోనే వుంటాడు. అతనింటికి రకరకాల వ్యక్తులు వస్తూ వుండేవాళ్ళు. రాజశేఖరానికి వారి ప్రవర్తన జుగుప్సాకరంగా వుండేది. సాధ్యమైనంత త్వరలో అక్కడ నుంచి బయట పడాలనుకున్నాడు.

అయితే రంగనాథం వూరుకోలేదు.

'నీకు పుట్టిన బుద్ధేనా ఇది మీ అమ్మ చెప్పిందా? మీ అమ్మ నా చెల్లెలు కాదూ? మేనల్లుడికి నాలుగు నెలలు అన్నం పెట్ట లేనూ? నన్ను అవమానం చేయకు. నేను [illegible]' అన్నాడు.

రాజశేఖరం ఇంకేమీ మాట్లాడలేక వూరుకున్నాడు.

* * *

'రా వోయ్ రాజా. కా[illegible]?'

న్నాడు రంగనాథం.

రాజశేఖరం తలూపాడు.

'కూర్చో. ఏమిటి విశేషాలు? అమ్మాయి ఉత్తరాలు రాస్తున్నదా?'

'ఆఁ! నిన్ననే ఉత్తరం వచ్చింది' అన్నాడు కుర్చీలో కూర్చుంటూ.

'సిగరెట్ తాగుతావా?' అన్నాడు గోల్డ్ ఫ్లేక్ సిగరెట్ పాకెట్ ముందుకు తోసి.

'థాంక్స్ అలవాటు లేదు.'

'అలవాటేమిటోయ్, మా కందరికి మొదట్నుంచి అలవాటుందా? ఏపనైనా నాలుగుసార్లు చేస్తే అయిదోసారి అలవాటవుతుంది ఈ రోజుల్లో సిగరెట్ చేతిలో వుండటం ఫాషన్. అందులో కాబోయే మేనేజర్‌వి. రేపు పెద్ద పెద్దవాళ్ళతో ఎంతమందితోనో మాట్లాడ వలసి వస్తుంది. వాళ్ళు సిగరెట్ ఆఫర్ చేస్తే వద్దంటే ఏమిటోగా వుంటుంది. సిగరెట్ ఇస్తే తాగడం మర్యాద.'

రాజశేఖరం నవ్వి 'ఏమైనా లేని అలవాటునెందుకు చేసుకోటం?' అన్నాడు.

'యు ఆర్ రైట్. కాదనను. కాని చెప్పానుగా. రేపు బొంబాయినుంచి వో దగుల్బాజీ మీ కంపెనీ విషయం మాట్లాడటానికి వచ్చాడనుకో. వాడికి సిగిరెట్ కాల్చే అలవాటు ఏడ్చింది. నువ్వు ఆఫర్ చేయక తప్పదు. ఎందుకు? మన

# అమృత కలశం

పని కావటానికి. వాడితోపాటు నువ్వు కాల్చాలి. కంపెనీస్సేక్. వాడికిచ్చి నువ్వు కాల్చకపోతే 'ఛాదస్తుడి వ'నుకుంటాడు. బిజినెస్ రా అబ్బాయి. ప్యూర్ బిజినెస్. జీవితమంటేనే వ్యాపారం— అర్థమైందా?'

రాజశేఖరం మనస్సులో రంగురంగుల దీపాలు వెలిగాయి.

రంగనాధం అందుకున్నాడు.

'చూడు, ఈ ప్రపంచంలో ఒకరకం మనుష్యులున్నారు. వాళ్ళేమంటారో తెలుసా? ఇది చెడు. ఇది పాపం. నువ్వు చెడ్డవాడివి. నువ్వు పాపాత్ముడివి— అని. ఇవన్నీ అర్థంలేని మాటలు. నిజానికి ఆ పాపం చేయాలని వారికీ వుంది. ఆ ఆకర్షణనుంచి తప్పించుకోలేక మనం అనుభవిస్తుంటే చూడలేక అసూయతో మనకి అంటగట్టే పేర్లు అవి. వాళ్ళు ఏది పాపమంటున్నారో అందులో నిజమైన ఆనందం వుంది. దాన్ని అనుభవించ లేని పిరికివాళ్ళు వాళ్ళు. అసలేది పాపం? ఏది పుణ్యం? ఇవన్నీ మనిషి నిర్మించుకున్న పేకమేడలు. ఈ నాలుగు గోడల మధ్య కూర్చుని బందీలై పోతున్నారు.'

ఈ ధోరణికి రాజశేఖరం భయపడ్డాడు. రంగనాధం అతని కళ్ళముందు క్రొత్త




జీవితం ప్రదర్శిస్తున్నాడు. అక్కడ్నుంచి లేచి వెళ్ళిపోదామనుకున్నాడు.

కాని రంగనాథం పోనివ్వలేదు.

'నీ సంగతి చూడు. నీ మనస్సులో నిన్ను నువ్వు విడదీసుకుని చూడు. నీ వనుభవించే ఆనందం ఎక్కడుంది? నీలో వుంది. నీచుట్టూ ప్రపంచంలో వుంది. నీచుట్టూ ప్రకృతిలో వుంది. నువ్వు దాన్ని గ్రహించటంలోనే వుంది. నీమనస్సు సౌందర్యవంతమైతే నీచుట్టూ ప్రకృతి కూడ సౌందర్యవంతమై నీకు రసానుభూతి కలిగిస్తుంది. అంతే. కొంతమందికి జీవితాన్ని అనుభవించటం చేతకాదు.'

రాజశేఖరం మనస్సు ఆందోళనతో నిండిపోయింది. రంగనాధం పరోక్షంగా తనను అవమానిస్తున్నాడా? నిజంగా తనకు జీవితాన్ని అనుభవించటం చేతకాదా?

'మనం మన జీవిత చిత్రాన్ని ఎంత అందంగా గీసినా దానిలో ఆకర్షణ వుండాలి. అదంతా పైమెరుపు. గ్లామర్. నువ్వు క్లాసుకు పోయేటప్పుడు టై కడతావు, కోటు వేస్తావు. ఎందుకు? చేతులతో తినే బదులు స్పూన్స్‌తోను ఫోర్క్‌తోను తింటావు. ఎందుకు? నీ అంతరాత్మ కని ఇష్టమా కాదా అని ఎప్పుడైనా ప్రశ్నించుకున్నావా? నీకిష్టమున్నా లేకపోయినా తప్పదు. నీకొక స్టేటస్ వున్నప్పుడు, నలుగురిలో ప్రూవ్ అవుతున్నప్పుడు ఆ సాంఘిక మర్యాదను పాటించక తప్పదు. కాలం మారుతున్నది. దానితో సమానంగా మనమూ మారాలి. అప్పుడు? ఆ కాలం ధర్మమూ అని చెడుని సమర్థించుకోవటానికి మనకు లక్ష కారణాలు దొరుకుతాయి. అలాంటిదే సిగరెట్ కూడాను. అసలు వెనకటికి వో మహానుభావుడు అననే అన్నాడు. పొగ త్రాగని వాడు దున్నపోతై పుట్టున్' అని.

రాజశేఖరం మాట్లాడలేదు. ఎదురుగా వున్న 'లైఫ్' మాగజైన్ తిరుగ వేయసాగాడు.

'అసలు నన్నడిగితే మనిషి చెడిపోవటం అనేది అర్థంలేని మాట. నీతి అవినీతి, న్యాయము అన్యాయము వీటికి సహజమయిన విలువలు సంఘంలో లేవు. నాకు నువ్వు నా సన్యాసివి. ఎందుకంటే నువ్వు నాకు తృష్ణలేనివాడివిగా, అనుభూతిలేని

వాడివిగా కనిపిస్తావు. అందుకే నువ్వు అమాయకుడివో, గడుసువాడివో అర్థంకాదు. ఇవేవీ లేనప్పుడు చెడిపోవటం ఎట్లా?'

రాజశేఖరం ముఖం మీద బలవంతాన చిరునవ్వు తెచ్చుకుని 'అబ్బ, ఎంత వ్యాఖ్యానం చేశావు మామయ్యా!' అన్నాడు.

రంగనాథం నవ్వి 'లేదు రాజూ. నీ భవిష్యత్తు బ్రైట్‌గా వుండాలని చెబుతున్నానంతే. అసలు ఎక్కడో చదివాను. ఒకళ్ళకి మంచి అయింది వేరొకరికి చెడు అవుతుంది. నీ మంచిని నీవెరుని నిర్ణయించేందుకు సంఘానికేం హక్కుంది? సంఘానికి భయపడి నీ జీవితానికెందుకు పరిధులు నిర్మించుకుంటావు?' అన్నాడు.

'నేను సంఘానికి భయపడటం లేదు.'

రంగనాథం విరగబడి నవ్వాడు.

'భయపడటం లేదా? నీకన్నట్టు మంచిగా బ్రతకాలంటే నువ్వు సంఘానికి భయపడాలి. నువ్వు చేసే ప్రతిపనిని భూతద్దం క్రింద పెట్టి పరీక్ష చేస్తుంది సంఘం. అంటే మరో విధంగా సంఘం నిన్ను చెడ్డవాడిని చేస్తున్నది. తప్పు చేయటానికి భయపడనివాళ్ళు ఆ తప్పు చేస్తున్నప్పుడు ఎవరన్నా చూస్తున్నారేమో నని భయపడతారు. అంటే పట్టుబడితే దొంగ లేకపోతే దొర.'

రాజశేఖరం విసుగ్గా లేచి 'ఏమిటో, నాకేం అంతు బట్టటం లేదు.' అన్నాడు.

'మై డియర్ రాజా, నువ్వు అందమైన తుమ్మెదలాంటి వాడివి. నీ జీవితం ఎలా వెళ్ళటం నాకు బాధగా వుంటుంది. అంతకన్నా నీ జీవితాన్ని కళామయం చేసుకో. జీవితాన్ని అనుభవించటం ఒక సాధన. మళ్ళీ అక్కడి కెళ్తే నీ సంసారం గొడవ వుండనే వుంది.'

రాజశేఖరం మనస్సుకు ఊపిరాడలేదు. ఒక్కసారి అతని జీవితం తల్లక్రిందులై పోయింది.

'రాజు, నీ ఆనందాన్ని నువ్వు సంపాదించుకోవటం అస్వాభావికమేమీ కాదు. అందులో అధర్మమేమీ లేదు. బ్రతకటం పాపం కాదు. అనుభవించు.'

రాజశేఖరం 'భగవాన్, నీతో వాదించలేను.' ఒక్క సిగిరెట్ మీద ఎంత వ్యాఖ్యానం చేశావు.' అన్నాడు.

రంగనాథం మాట్లాడలేదు.

లేచి వెళ్ళి, అతని నోట్లో సిగిరెట్ పెట్టి వెలిగించాడు.

రాజశేఖరం ఆత్మ గిల గిల్లాడింది.

అతని బలహీనతని రంగనాథం జయించాడు.

రాజశేఖరం రెండు పీల్పులు పీల్చాడు!

సిగరెట్ పొగ అతన్ని చుట్టేసింది!

* * *

రాజశేఖరం చేసిన ప్రయత్నం ఫలించింది. శంకరానికి రేపల్లె ట్రాన్స్‌ఫర్ అయింది. రేపల్లె మరీ పల్లెటూరు కాదు. మరీ బస్తీ కాదు. మధ్యరకం వూరు. మీనాక్షి తేలిగ్గా వూపిరి పీల్చింది.

శంకరానికి వచ్చే నూట అరవయి రూపాయలు మీనాక్షి చేసే పొదుపువల్ల ఎక్కువే అయింది. మీనాక్షి చాల జాగ్రత్తగా వాడేది. నెలకు ఎంతలేదన్నా ఇరవయి రూపాయిలన్నా మిగిలేవి. అదిగాక కృష్ణవేణి పట్టుబట్టి అతనిచేత మూడువేలకి భీమా చేయించింది.

ఇన్నాళ్ళ తరువాత శంకరంలో కొంత చైతన్యం కలిగింది. భార్యమీదే అనురాగం అతడ్ని ముగ్ధుడ్ని చేసింది. ధనంలో లేనిది తనకు తాను సృష్టించుకోలేని ఆనందం మీనాక్షి సహకారంతో అతని జీవితంలో అనుభవంలోకి వచ్చింది. ఇన్నాళ్ళు తను ఏంతో పోగొట్టుకున్నట్టు అతనికి తెలిసింది. ఈ ఆనందంలో సత్యము. సౌందర్యము రెండు వున్నాయి. ప్రతి పనిలోనూ మీనాక్షికి శంకరం సహకారం. ఆత్మీయత లభించినట్టే, శంకరానికి మీనాక్షి సహకారం లభించింది. రెండు చక్రాలు సరిగా తిరిగితే బండిపోకేం చేస్తుంది?

ఇదివరకులా రోజు రాత్రిపూట ఎనిమిది దాకా కూర్చోనక్కర్లేదు. ఇక్కడ ఆఫీసరు మంచివాడు. అయిదుగంటల తరువాత ఏంతపనున్నా మరునాడు వచ్చి చేయమంటాడు. అలాంటి ఆఫీసరు దొరకటం శంకరం అదృష్టమే అవాలి. అందుచేత అతనికి విశ్రాంతి లభించేది.

# అమృత కలశం

అతను అయిదుగంటలకి ఇంటికి రాగానే మీనాక్షి కాఫీచేసి సిద్ధంగా వుంచేది. శంకరం కాఫీ తాగేసి. ముఖం కడుక్కుని బజారువైపుకో, లైబ్రరీకో పోయేవాడు. ఒక్కోరోజు మీనాక్షిని కూడ తీసుకు వెళ్ళేవాడు. అయితే ఈ జీవితంలో ఒక ముఖ్యమైన మార్పు వుంది. ధైర్యంగా వచ్చేటప్పుడు పూలు తెచ్చేవాడు. అతనిచ్చిన సన్నజాజులంటే మీనాక్షికి ప్రాణం. అతను పూలుతెచ్చి తల్లో అలంకరిస్తుంటే పులకరించి పోయేది. గతంలో అవమానం చేత కలిగిన గాయాలు క్రమంగా మానిపోతున్నాయి. వారి స్వేచ్ఛ నరికట్టేవారెవరు లేరిక్కడ.

శంకరానికి బదిలీ అయిందని తెలిసినప్పుడు శివనాథం. మీనాక్షి పుట్టింటికి వెళ్ళి ఏదో గూడుపుఠాణి చేసిందని అనుమానించాడు. ఈ బదిలీ ఆపటానికి శాయిశక్తులా ప్రయత్నించాడు. కాని ప్రయోజనం లేకపోయింది, చివరికి: 'ఈ వెధవ ఉద్యోగంపోతే పోనీరా అబ్బాయి ... ఈ వాళ్ళలోనే నేరే చూస్తాం. ఎక్కడో రేపల్లెలో ఏం వుంటారు? మనసంతే అంతంత మాత్రపువాడివి. ఈ ఉద్యోగం లేకపోతే బ్రతకలేవా ఏన్నా?' అన్నాడు.

అయితే మీనాక్షి భయపడినట్లు శంకరం వూరుకోలేదు.

'అదేం మాట నాన్నా, ఎక్కడేపనుంటే ఉద్యోగం వదులుకుంటే ఎట్లా? ఉద్యోగమన్నాక బదిలీలుండడా ఎట్లా వుంటుంది? రేపల్లె ఏమంత దూరం? ఉద్యోగికి దూరభారాలు లేవన్నారు.'

శంకరం ఇప్పుడిప్పుడే రెక్కలు విప్పుకుంటున్నాడు. భార్య సహకారంతో ఎగరాలని ప్రయత్నిస్తున్నాడు ఒకవిధంగా దీనికి తమ మూర్ఖప్రవర్తనలే కారణమని శివనాథంగాని, వరసమ్మగాని తెలుసుకోలేరు. తమని తాము బంధించుకున్న సూత్రాల లోంచి బయటపడలేని నిస్సహాయ జనిత జీవితాలు వారివి వాటిని గురించి వాళ్ళు ఏనాడు ఆత్మవిచారణ చేసుకోలేదు. జరిగే ప్రతిపని తమకు ప్రయోజనకరంగా వుండాలని వారినుతం. అందుకే వాళ్ళు ప్రపంచం వైపు ఏనాడు కన్నెత్తికూడ లేదు. కనుకనే శంకరం జీవితంలో సంభవం, ఎలాంటి విప్లవం తెస్తున్నదో గ్రహించలేక పోయారు. శంకరం తను నంచి దూరంగా పోవాలని చూస్తున్నాడని మాత్రమే వారికి తెలిసింది. శివనాథం చేసేదిలేక ఆ కసి మీనాక్షిమీద చూపించాడు.

'ఇదిగో కోడలా, ఈ ఇంట్లోని ఇత్తడి చెంబుమీద కూడ మీకు హక్కులేదు. వేరే పోతున్నారుగా, కొనుక్కోండి. మీ ఆయన వందలు వందలు సంపాదించే పెద్ద ఆఫీసరాయను, మేం పనికొస్తామా?' అన్నాడు.

మీనాక్షికి కళ్ళు నీళ్ళు పర్యంతం అయింది. ఆమాటలు విన్నాక శంకరానికి మరింత పట్టుదల హెచ్చింది. ... కంపరంలోంచి ఎంత త్వరగా బయటపడదామా అని ప్రయత్నించ సాగాడు.

మీనాక్షికి ఆగాదేశ కృష్ణవేణి కోపించింది. ఈ పరిస్థితులన్నీ వివరిస్తూ ఉత్తరం రాసింది. సరిగా ఈ సమయానికి కృష్ణవేణి వచ్చి ఆదుకుంది. రెండు



రోజుల్లో రేపల్లె వెళ్ళి ఒక స్నేహితురాలి సహాయంతో చిన్న ఇల్లు చూసింది. ఆ యిదువందల రూపాయలు పెట్టి సంసారానికి కావలసిన ప్రాతసామానులు కొని పెట్టింది. శంకరం, మీనాక్షి తమ బట్టలు మాత్రమే తీసుకుని బయలు దేరారు.

వచ్చేటప్పుడు సుందరం మీనాక్షిని చాటుగా పిలిచి 'చూడు మీనాక్షీ. ఈపాతిక రూపాయలు పెట్టి ఏదైనా చీరకొనుక్కో. ఒట్టి సిల్కువి కూడాకాదు. నిన్నిట్టా బొట్టు కూడ పెట్టకుండా పంపటం తప్పుకూడాను.' అంటూ బొట్టు పెట్టింది.

మీనాక్షి కృతజ్ఞత వెల్లివిరుస్తున్న నేత్రాలతో సుందరాన్ని చూసింది. శంకరం మీనాక్షి రేపల్లె చేరేసరికి కృష్ణవేణి స్టేషన్‌కు వచ్చి ఇంటికి తీసుకువెళ్ళింది. మీనాక్షికి ఇల్లు నచ్చింది. అన్నింటికి మించి అద్దె చౌక.

కొత్త సంసారం, ఇద్దరూ తమకు కావలసిన ఆనందాన్ని ఒకరి జీవితంలో ఒకరు వెదుక్కోసాగారు.

నాలుగు రోజులుండి కృష్ణవేణి వెళ్ళి పోయింది. పోతూ మీనాక్షిని పిలిచి, 'చూడు మీనాక్షి ఎంత మగవాడు సంపాదిస్తున్నా సంసారం నడపటం మన చేతుల్లోనే వుంది. ఎంత లేదన్నా నెలకు ఇరవయి రూపాయలన్నా మిగల్చాలి. మనకి తెలియకుండానే ఎన్నో అనవసరపు ఖర్చులు చేస్తాం. కొంచెం జాగ్రత్తగా వుంటే వాటిని తప్పించి ఆదా చేయవచ్చు. మీ ఆయనకి నూటనలభయి వస్తే ఏం చేస్తావు? జీతం రాగానే ఇరవయి ముందు బాంకులో వేయమను. సుఖమనేది రూపాయాలలో లేదు. ఆత్మీయతలోను, తృప్తిలోను వుంది' అంది. మీనాక్షి తలూపి 'అలాగే వదినా' అంది. అనటమే కాదు అక్షరాలా ఆచరణలో, పెట్టింది.

(ఇంకా వుంది)

# ఎవ్వారికో

కె.వి.ఎస్.శర్మ

కృష్ణుడు మా దత్తపుత్రుడు. వాడిని చూసినప్పుడల్లా మారుతున్న ప్రపంచంతో మారటం ఇష్టం లేని మనుషులు గుర్తొస్తారు. అతివేగంగా ప్రవహించే నీటిలో ప్రయాణంచేసే చిన్న పడవకి కాల ప్రవాహంలో ప్రయాణంచేసే మనిషికి పోలికలున్నాయి. పడవని ప్రవాహానికి వాలుగా సులభంగా నడపచ్చు. కాల ప్రవాహంలో మనిషి జీవితం అంతే. అతని శక్తి కాలానికి ఎదురీదితే ఎంతోసేపు సరిపోదు. కాని వాలుగా ప్రయాణిస్తే సులభంగా చాలా దూరం పోడానికి శక్తి సరిపోతుంది. పడవలోని మనిషికి ప్రదేశంతోపాటు ప్రకృతి దృశ్యాలు మారినట్టే, కాలంలో ప్రయాణం చేసేవారికి సమాజపు రూపు రేఖలు మారుతూ వుంటాయి. పడవలో పోతున్న మనిషి [illegible] చేరవల్సినచోటు ఒకచోట [illegible] దృశ్యమే బాగుందని అనుకుని అక్కడే ఆపటంకోసం ప్రయత్నిస్తే [illegible] లాంటి [illegible]రలో అలిసిపోతాడు. ఆపైన అతనికి పడవను ప్రవాహానికి వాలుగా నడిపే శక్తికూడా ఉండదు. అప్పుడు ప్రవాహం చేర్చిన ఒడ్డుకు చేరుకుంటాడు. అల్లాగే కాల ప్రవాహంలో మనిషి తనకి నచ్చిన విలువలకి, కట్టుబాటకి కాలప్రమేయం లేకుండా అంటుకుపోడానికి ఎదురీదే వ్యర్థప్రయత్నం చేస్తే అలిసిపోతాడు. అలిసిపోయి, విసిగిపోయి 'నేను విధికి బానిసను' అని తన జీవితాన్ని సక్రమమైన మార్గంలో నడిపే ప్రయత్నాన్ని విరమించుకుంటాడు. కారుని తనిష్టమైనట్టు పోనిచ్చే డ్రైవరువల్ల మిగిలిన వారు బాధపడ్డట్టు ఈ విధికి బానిసల వల్ల సమాజం బాధపడుతుంది, ఇది నా అభిప్రాయం. దీనితో సుశీల, రఘు, సత్యనారాయణగారు, సుబ్బారావుగారు ఏకీభవించరు. వీళ్ళందరు కాలానికి ఎదురీది విఫలప్రయాణంచేత విధికి బానిసలుగా మారినవారు. వీరివల్ల బాధ పడ్డవాడు కృష్ణుడు. కృష్ణుడు సుశీల రఘుల కొడుకు.

ఈ ఐదుగురితో నాకు ఏదో విధమైన వ్యక్తిగత సంబంధాలున్నాయి. అందులో ముఖ్యమైనది నిజం చెప్పాలంటే నేను ఒకప్పుడు సుశీలను ప్రేమించానని అనుకుంటూ వుండేవాడిని. ఇప్పుడల్లా అనుకోడానికి సుశీల బతికిలేదు. బతికున్నా ప్రేమించగలనని కాదు. అయితే ఈ విషయం నేనెప్పుడూ వరలక్ష్మికి అంటే మా ఆవిడకు, చెప్పలేదు. నేను సుశీలను ఒకప్పుడు ప్రేమించానన్న విషయం నమ్మినంత సులభంగా మానేసానన్న విషయం నమ్మదు. కొన్ని విషయాలు భార్యలకి చెప్పి నమ్మించడానికి ప్రయత్నించేకన్నా చెప్పకపోడం మంచి పద్ధతనుకుంటాను. ఒక వేళ నేను, వరలక్ష్మికి ఆ విషయం చెప్పుంటే, ఈ [illegible]డు నేను, తను కృష్ణుడిని పెంచుకోడంలో, నేను కుట్ర చేశానని తను నమ్ముతుందని నా నమ్మకం. అప్పుడు [illegible] కృష్ణు



డం ట వరలక్ష్మికున్న అభిమానం హరించుకు పోతుంది. ఇదీ నా అభిప్రాయమే. విందుకంటే ఇందులో ఏదీ నేను చేసి ఏం జరుగుతుందో చూడలేదు.

నిజానికి సుశీల అందగత్తె కాదు. మొదట్లో అసాధారణపు ఆడపిల్ల. వయస్సు వచ్చాక అతి సాధారణపు ఆడదీను. ఆమె అందం కారణంగా నా ప్రేమింపోలేదు. నా దృష్టిలో ఆ దరుని అందరూ అవే దానికి అట్టే విలువలేదు. బహుశహా నన్ను ఆ కోవలోకి ప్రపంచం జేర్చకపోడంచేత కావచ్చును ఇంతకీ అసలు కారణం నేను సుశీలను ప్రేమించలేదు. ప్రేమించడాన్ని ప్రేమించేవాడివి. అందుకని సుశీలను ప్రేమింనానని అనుకునేవాడినని ఇప్పుడు అనుకుంటాను. ఇప్పుడు ప్రేమనేది ఉత్త దన్న హదాన్ని. నేను ప్రేమిస్తూ వుండి వుండమ్మను. నేను మనిషినేగా. నాకు కొన్ని మనుషులకుండే బలహీనతలున్నాయి. సుశీల మా ఎదురింట్లో వుండేది. మాది చిన్నసైజు పట్నానికన్నా చిన్నవూరు. పెద్దగామంకన్నా పెద్దవూరు. మాఊళ్లో నా చిన్నప్పుడే పి. యు. సి. ఉన్న కాలేజి వుండి. నేను అందులోనే చదువుకున్నాను. మావూళ్లో ప్రతిఇంట్లో జరిగే ప్రతి చిన్నవిషయం కొందరి ధర్మమా అని ఊళ్లో అందరికి తెలిసేది. సుశీల తండ్రి సత్యనారాయణగారు వో చిన్న భూఖామందు. ఆయనకి సుశీల ఒక్కతే సంతానం. ఆయనకి కాలుమీద కాలు వేసుకుని కూర్చుంటే భుక్తికిబ్బంది లేకుండా గడిచిపోయేది. ఆయనందుచేత వీధరుగుమీద కుర్చీ వేసుకుని అందులో కాలుమీద కాలువేసుకుని కూర్చునేవాడు. అల్లా కూర్చుని వచ్చే పోయేవాళ్లని పలకరించేవాడు.

మా నాన్నగారు చిన్న వుద్యోగంచేసి విశ్రాంతిని పుచ్చుకుంటూ చిన్న ఇంట్లో వుండేవారు. ఆయనకి నేను కాకుండా మా చెల్లెలు సుగుణతూ సంతానం. సుశీల మా సుగుణతో ఆడుకోడానికి మా ఇంటికి వచ్చేది. చెల్లెళ్ళున్న అందరు భాగ్యశాలురిలాగానే నాకు మా చెలెలి స్నేహితురాల్ని ప్రేమించే అవకాశం కలిగింది, 'అన్నయ్యా! సుశీలకు జామకాయలు కావాలిట కోసి పెట్టరా!' అని విస్మయ్డైనా సుగుణ అడిగితే జామచెట్టెక్కిన నాకు విసుగెక్కినట్టుండేది. జామకాయ తింటూ సుశీల తనకళ్లు పెద్దవిచేసి నాకేసి చూడ్డం నన్ను కలవర పరిచేది. సుశీల నన్ను ఆరాధిస్తోందన్న భావాన్ని నేను ఆరాధించడం మొదలుపెట్టాను. దీన్ని. నేను నిక్కర్లు వదిలి పేంట్లు వేసుకుంటున్న రోజుల్లో అంటే పి. యు. సి. చదువుతున్న రోజుల్లో నేను ప్రేమ అనుకునేవాడిని. ఆమె కామాపు మామూలని, దానికి పెద్ద ప్రాముఖ్యంలేదని 'ఛా! నిన్ను నేను పెళ్లెందుకు చేసుకుంటాను' అని ఆతరువాత నాతో అల్లా చూస్తూ అన్నప్పుడు కాని నాకర్థంకాలేదు. ఆమె నన్ను ఆరాధించటం లేదన్న విషయం తెలియగానే నా ఆరాధన ఆగిపోయింది.

సుశీల మా ఇంట్లో అందరితోను చనువుగా వుండేది. పండగలకి పబ్బాలకి జడకుప్పెలు, కాటుకలు పెట్టుకుని, పట్టు పరికిణిలు కట్టుకుని మా ఇంటికివస్తే అదంతా నాకోసమే ననుకుని ఆనందించేవాడిని. అప్పుడు సుశీల ఫోర్తుఫారమ్ చదువుతోంది సుగుణతో ఆడపిల్లల స్కూల్లో. సుగుణకి, సుశీల చెప్పే పాతివ్రత్యం, పాతచింతకాయ పచ్చడి అంటూ చెప్పే కబురిష్టం వుండేదికాదు. నేను సుశీలను కాబోయేభార్యగా ఊహించుకోడం వల్ల సుశీలకు పాతివ్రత్యం మీద సుగుణలాగా కాకుండా గౌరవం వుండటం నాకు నచ్చేది. సుగుణ దొరసాని బుద్ధులు (అరోజుల్లో వాటిని నేను, కొంతమంది స్నేహితులం వాటికి అల్లా నామకరణం చేసాం) నచ్చేవి కావు నాకు. మన సాంప్రదాయలంటే చాలా గౌరవం. కాని అ కాలంతో మారుతూ వచ్చినవేనని ఇకముందు మారుతాయని నాకారోజుల్లో తెలియదు. సత్యనారాయణగారికి బతికున్నన్నాళ్లు తెలియలేదు. నిజానికి నేను మెడిసిన్ చదవడానికి విశాఖపట్నం వెళ్ళేవరకు మా నారి పొలిమేరలు దాటలేదు. అందుకని సాంప్రదాయం అంటే అది మాఅమ్మ ఉంటున్న పద్ధతి అని అనుకునేవాడిని.

నేను మెడిసిన్ రెండో సంవత్సరం పూర్తిచేసిన వేసంగి కాలంలో సుగుణ సుశీల స్కూలు ఫైనలు పాసయ్యారు. సుగుణ మా ఊళ్లోవున్న కాలేజీలో పి. యు. సి. లో జేరటానికి నిశ్చయం చేసుకుంది. అప్పుడు నేను సుశీలను 'నువ్వేం చేస్తావ్?' అని అడిగాను. 'ఇంట్లోకూర్చుని పనిపాట నేర్చుకుంటాను. అయినా అంత మంది మొగపిల్లలమధ్య సిగ్గూ ఎగ్గూ లేకుండా కూర్చుని చదువుకోలేను నేను. మానాన్నకీ ఇష్టంలేదు' అని ఆకిమని జవాబుచెప్పింది సుశీల. ఆసిగ్గూ ఎగ్గూలేని జాతిలో సుగుణ జేరుతుందని, తను అల్లా అంటే నేను బాధపడతానని తెలిసీ సుశీల ఆ మాటనడం నన్ను నిజంగా బాధపెట్టింది. కాని అటువంటి సిగ్గుల భరిణను పెళ్ళిచేసుకుంటే, ఇంట్లో నాలుగు గోడలమధ్య ఉండి పలుగురి మొగాళ్ళ మధ్యకి తరుగునమ్మా అని మా కాలేజీలో అమ్మాయిల్లా రాకుండా నన్ను సుఖపెడుతుందనే స్వార్థం నన్ను వోదార్చింది. అయితే సుశీల పలుకులు కేవలం చిలుక పలుకులని ఆమె ఆలోచించడం నేర్చుకోడం ఇంకా మొదలుపెట్టలేదని బహుశా పెట్టదని నాకు అనిపించలేదు. ఆమెకు నాతో చనువుగా బాతాఖాని కొట్టడంలో సిగ్గూ ఎగ్గూ కల్లకపోవడం గురించిన ఆలోచన అప్పుడు నాకురాలేదు. వచ్చినా కాలేజీలో అమ్మాయిలు నాఅంత బుద్ధిమంతులు కారని ఆ రోజుల్లో నమ్మతూ ఉండేవాడిని కనుక ఆమె అభిప్రాయం అదేనని సరిపెట్టుకునేవాడినేమో!

కాని ఆ మరుసటి సంవత్సరం విశాఖపట్నపు వాతావరణంలో నేను కొంచెం మారాను. చదువుకునే ఆడపిల్లలు చెడిపోడంకోసం కాలేజీలకి రారని చెడిపోదల్చుకున్నవాళ్ళు ఇంట్లో వున్నా చెడిపోతారని గ్రహించటం మొదలుపెట్టాను. అందుకనే సుగుణ పి. యు. సి. అయ్యాక మెడిసిన్‌లో జేరతానంటే ప్రోత్సాహిచ్చాను సత్యనారాయణగారు మాత్రం 'ఏరా అబ్బా మీ నాన్న చిన్నచేతి ఉద్యోగాలు [illegible] ఊళ్ళో [illegible]?' అని సుగుణని [illegible] తెలిసినప్పుడు [illegible] ఆయనన్నది [illegible]



వింతగా కన్పించలేదు. నేను మా ఊళ్లో వున్న రోజుల్లో ఎవరైనా అలాంటి మాటలన్నప్పుడు నాకు చాలా అర్థవంతంగా కన్పించేది. కాని మా ఊరువదిలాక బయట ప్రపంచం చాలా మారిందని గ్రహించాను.

సుగుణ మెడిసిన్‌లో జేరాక మేము మావూరు వెళ్ళినప్పుడు సుశీల మమ్మల్ని తప్పించుకు తిరగటం గుర్తించాను. అందుని ఆమెను పోరోజు ఆంజనేయస్వామి గుళ్లో పట్టుకుని 'ఏం సుశీలా! కనిపించటం మానేసావ్?' అని అడిగాను. 'మీ సుగుణ సాంగసంచేస్తే నాకు పెళ్ళవదని మానాన్న చెప్పాడు' అని సుశీల జవాబు చెప్పింది. నాకు బాధవేసింది. కాని అది అమాయకురాలైన సుశీల తప్పుకాదని సత్యనారాయణగారి తప్పని నేను సర్దిచెప్పుకుని 'ఎవరో ఏందుకు? నేమున్నానుగా నిన్ను పెళ్ళి చేసుకునేందుకు' అన్నాను. 'ఛ! నిన్నెందుకు పెళ్ళి చేసుకుంటాను. మీ కాలేజీలో మీగు విద్యార్థులతో పోటీ రాటగా, ఆ చదువు చదివే ఆడపిల్లలకి మగపిల్లలకి నీతుండదని మా నాన్న చెప్పాడు' అంది సుశీల. అప్పుడను కున్నాను 'సుశీలా! నిన్ను భగవంతుడే రక్షించాలి అని. ఆమె ఆ మాటలంటూ కళ్ళు పెద్దవి చేయటం గుర్తుకువచ్చి అల్లా కళ్ళు పెద్దవి చేయటం అందంతోకాదని ఆమె అలవాటన్న విషయం. అన్ని సంవత్సరాలలో అదే మొదటిసారి నేను గుర్తుపట్టాను. సుశీల ఆ మాటలనడం నన్ను బాధపెట్టినా, అహం దెబ్బతిన్నా, ఆమెను పెళ్ళాడే బాధ్యత నాకు తప్పినందుకు మనస్సు మీద నుంచి పెద్ద బరువు దింపినట్లు అనిపించి సంతోషించాను. అన్ని రోజులుగా నేను సుశీలను పెళ్ళి చేసుకోడం నా ధర్మమని, నేను చేసుకోకపోతే ఆమె అన్యాయం అయిపోతుందని అనుకునే వాడిని. సుశీలను పెళ్ళి చేసుకోబోతున్నట్లు అప్పటికింకా ఎవరితోను అననందుకు నన్ను నేను అభినందించుకున్నాను.

కొన్నాళ్ళకి సత్యనారాయణగారు సుశీలకి సంబంధాలు వెతుకుతున్నట్లు తెలిసింది. అతే ఆమె సాధారణపు అందం, చదువు వరుల కట్నపు రేటుని పెంచాయి. సత్యనారాయణగారు కాలుమీద కాలేసుకుని ఆస్తిని కరిగించటంవల్ల ఆయన ఆ ధరలు పెట్టి వాళ్ళను కొనే స్థితిలో లేదు. ఆయనకే సాధారణపు సంబంధాలు చూడ్డం ఇష్టంలేదు.

నాకీలోపల ప్రేమించటం మీద ప్రేమ తగ్గింది. ప్రేమించి పెళ్ళి చేసుకున్నవాళ్ళని చూసాక ఆ మార్పు వచ్చింది. ప్రేమ మత్తులో ప్రతివాళ్ళు వాళ్ళ నిజ స్వరూపాల్ని దాచుకుని అవతలివాళ్ళ మెప్పుకోసం తాపత్రయం పడటం, ఆ పైన పెళ్ళయ్యాక ఒకరి నిజ స్వరూపం ఇంకొకరికి తెలిసాక ఈ పెళ్ళెందుకు అని ఏడవటం, ఇవన్నీ చూసాక నా పెళ్ళి విషయం మా తల్లిదండ్రులకి పూర్తిగా వదిలేసాను. నా పెళ్ళి మా సుగుణ పెళ్ళి ఒకేసారి అయ్యాయి. సుశీల సుగుణ పెళ్ళిలో 'ఏదో గంతకు తగ్గ బొంత సంబంధం చూడ్డం మా నాన్న కిష్టంలేదు ఎవడ్నో ఒకడిని తొందరపడి కక్కుర్తిగా పెళ్ళి చేసుకోవాల్సిన ఖర్మ నాకేం లేదని మానాన్న అన్నాడు.' అని ఎవరో మాటలుమోసే వారిదగ్గర అంటె అవి వారు మాకు జేరవేసారు.

ఆతరువాత ఎప్పుడో కొందరు హితోభిలాషులు సత్యనారాయణ గారితో 'పోనీ మీ సుశీల చదువుకుంది కదా! కాస్త పెళ్ళయేదాకా అయినా ఉద్యోగంలో పెట్టండి. అది ఆమెకు కాలక్షేపంగానూ ఉంటుంది, మీకు కాస్త వెసులుబాటుగానూ వుంటుందని' అన్నారని అంటే ఆయన 'నాకాడపిల్ల సంపాదనమీద ఆధారపడాల్సిన ఖర్మేం పట్టలేదు. ఆమాట మరోసారి అంటే మీరు మరి మాగడప తొక్కాల్సిన అవసరం వుండదు' అన్నాడని, వాళ్ళకి ఆయన గడప తొక్కే అవసరం వుండటంచేత ఆమాట వాళ్ళు మళ్ళీ ఆయన దగ్గరెత్తలేదని తెలిసింది.

నేను, సుశీలకు ఇరవై సంవత్సరాలున్నప్పుడు ఉద్యోగరీత్యా మావూరు వదిలేసాను. గవర్నమెంటు వుద్యోగంలో చాలా ఊళ్ళు చుట్టపెట్టి కాకినాడ జేరుకున్నాను. ఈ పన్నెండేళ్లలో నాకు సుశీల తటస్థపడలేదు. కాకినాడ వరలక్ష్మి వాళ్ళ పుట్టింటికి దగ్గిర ప్రాంతం. వరలక్ష్మికి దేవుడు పిల్లల్నివ్వలేదు. దేవుడవ్వని పిల్లల విషయంలో భర్తగానే తప్పు నాకపోగా నేను సహాయం చెయ్యటం వరలక్ష్మి కిష్టంలేదు. వరలక్ష్మి మరీ వెలితితో బాధపడుతుంటే ఆయినవాళ్ళ మధ్య ఆ బాధను మర్చిపోయే అవకాశం వుందని అడిగి కాకినాడకి వుద్యోగం మార్చుకున్నాను.

అప్పుడప్పుడు వరలక్ష్మి 'మీరు మరో పెళ్ళి చేసుకోండ'ని నాకు సలహా ఇచ్చినా నేను దానికి నిద్రలోకూడా తలూపలేదు. తలూపితే నాపాట్లు దేముడికెరుకన్న విషయం నాకు బాగా తెలుసు. అందుకని 'దేము డెప్పుడో మనల్ని తప్పకుండా చల్లని చూపు చూస్తాడు అంతవరకు ఆగుదాము' అనేవాడిని. ఆ జవాబు విన్నప్పుడు వరలక్ష్మి కళ్ళల్లో కనిపించే వెలుగు చాలు. ఆమె ఆ మాట ఎంత నిజంగా అన్నదో అర్థమవటానికి. అందుకని వరలక్ష్మికి పుట్టింటిగాలి పడుతుందని కాకినాడకు మారాను. అక్కడే నాకు రఘు కనిపించింది.

రఘు నేను విశాఖపట్నంలో చదువుకున్నాం. ఇద్దరం హాస్టల్లో ఒకే గదిలో ఉన్నాం ఒకేమెస్సులో తిన్నాం. రఘుగురించి నాకు చాలా తెలుసు. అతనికి శుభ్రత నేది ఒకజబ్బు. అతనికి గది ఏమాత్రం చిందరవందరగా ఉన్నా పిచ్చెక్కినట్లయ్యేది. 'అతను నను, గోడ్ను పేడవేసుకుని దాని మధ్య పడుక్కున్నట్లు చుట్టూ, ఆసిగరెట్టు పీక లేమిటోయి' అని విసుక్కునేవాడు. 'మరి అల్లాగనక గురూ! మాఇంట్లో అందరూ నాకు చాలా శుభ్రం ఎక్కువ అంటూ ఉంటారు' అనేవాడిని దానికతను 'మీ ఇంట్లోవాళ్ళకి నువ్వంటే లా ఇష్టమైనా అయ్యుండాలి లేక వాళ్ళు నీకన్నా... అదెందుకులే ముందరిదే అనుకుందా'మనేవాడు. అతనిది ఇతరను నొప్పించే స్వభావంకాదు. అందుకని నా వస్తువుల అమరిక విషయంలోకూడా అతనే శ్రద్ధవహించేవాడు. చిన్నప్పుడు నా చదువుకునేరోజుల్లో, రఘు, పెళ్ళయ్యాక వరలక్ష్మి నాగురించి శ్రద్ధ తీసుకోడం నా అదృష్టం. అందుకనే రఘుగురన్నా నాకు చాలా ఇష్టం. ఇలాంటి రఘుకి పులిలాంటి తండ్రి సుబ్బారావుగారు. ఆయన వ్రాసే ఉత్తరాల్ని చూసి గాని రఘు జడుసుకునేవాడు. అతను అందుకనే సుబ్బారావుగారు సూచించిన మెడిలో చదువు

# మీ వస్త్రములను సబ్బుతో ఉతికినంతమాత్రాన చాలదు......







# వస్త్రముల స్వచ్ఛమైన తెల్లదనానికి రాబిన్ బ్లూ వాడండి

మీ తెల్లని వస్త్రములను సబ్బుతో ఉతికినంతమాత్రాన చాలదు. కారణం సబ్బుతో ఉతికితే కేవలం మురికిని, నూనె మరకలను, మరకలను మాత్రమే నివారించ గలదు. కాని వస్త్రములు తెల్లగా లేక నిర్జీవంగా వుంటాయి.

మరి దీనిని నివారించటం ఎలా?

చాలా తేలిక. తెల్లని వస్త్రములను ఉతికిన తరువాత ఒక బొక్కెన నీటిలో స్వచ్ఛమైన బ్లూ—రాబిన్ బ్లూ కలిపి ఆ నీటిలో ఝాడించాలి. మరే యితర బ్లూలు యివ్వలేనటువంటి స్వచ్ఛమైన ప్రకాశవంతమైన తెల్లదనాన్ని రాబిన్ బ్లూ మాత్రమే యివ్వగలదు. ఓ చిన్న ప్యాకెట్టురాబిన్ బ్లూ 100 వస్త్రములకు పైగా ఆటిరాగలదు. ధరకూడా అతి స్వల్పం.

[illegible] నకిలీ ప్యాకెట్లు వుంటాయ్, [illegible]త్తగా గమనించండి.

## రాబిన్ బ్లూ

మాత్రమే తెల్లని వస్త్రములకు స్వచ్ఛమైన, ప్రకాశవంతమైన తెల్లదనాన్ని చేకూర్చగలదు.

RCI రెక్కిట్ & కోల్మన్‌వారి తయారీ

ARBC-32 TEL



భార్యవకుండా తాళికట్టేశాడు. ఆ పెళ్ళికి నేను వెళ్ళాను.

కాకినాడలో కనిపించిన రఘుని 'ఎల్లా ఉన్నావ్ గురూ!' అని అడిగితే 'మానాన్నగారి సంగతి నీకు తెలుసుకదా! అందుకని అప్పుడెల్లా ఉన్నానో ఇప్పుడూ అలానే ఉన్నాను' అన్నాడు. ఆపైన 'ఇండియా కాంగ్రెసు రాజ్యంలో బాగుపడుతుందేమోకాని మాఇల్లు మానాన్నగారి రాజ్యంలో బాగుపడదు. నా ఖర్మ' అన్నాడు. అప్పటికీ ఇప్పటికి రఘులో ఒకటే మార్పు. అప్పుడు సుబ్బారావుగారి గురించి ఈ మాత్రం చెడ్డగా కూడా మాట్లాడేవాడు కాదు. చదువు ఉద్యోగంవున్న రఘు తనకి నచ్చినవిధంగా తన జీవితాన్ని ఎందుకు సరిదిద్దుకోడో నాకు అర్థంకాలేదు. తండ్రి నెదిరించటం అతని కిష్టంలేదు. తండ్రి చెప్పినట్టు వినటం అతను నమ్మేసూత్రం.

ఒకసారి అవసరం కలిగి రఘు వాళ్ళింటికి వెళ్ళాను. అప్పుడే నాకు సుబ్బారావుగారితో మాట్లాడే అవకాశం కలిగింది. ఆయన మాటల్లో 'అదే మా రోజుల్లో అయితేనా...' 'నేను రఘు వయస్సులో వున్నప్పుడు...' లాంటి పదజాలం చాలా దొర్లింది. ఆయనకి తనూ రఘు ఒకటి కాదని, అప్పుడు ఇప్పుడు ఒకటి కాదని గతం ఎంత బ్రహ్మాండంగా వున్నా అది వర్తమానం కాదని గుర్తింపు వున్నట్టు నాకు తోచలేదు. ఆ విషయం నేను ఆయన దృష్టికి ఆ గంట సేపట్లో తేవటానికి ఆయన తావివ్వలేదు. ఆ ఇల్లంతా చిందర వందరగా వుంది. ఆయన నా మనస్సులోని భావాలు చదివినట్టు నలుగురున్న ఇల్లు అల్లాగే వుంటుందని అభిప్రాయం వ్యక్తపరిచారు. రఘుకి నలుగురు ఆడపిల్లలు. ఆయనకి మార్పుపట్ల సదభిప్రాయం లేదని ఆయన కాలానికి ఎదురీదుతున్న మనిషని నాకు స్పష్టంగా తెలిసిపోయింది. ఆయన, కాలంతో మారే అలవాట్లకి కట్టుబాట్లకి కాలంలో మారని పారమార్థికమైన ధర్మాలకి ఒకే స్థాయిలో విలువను నిర్ణయించి మాట్లాడుతూ వుంటే నాకేం చెప్పాలో తోచలేదు. తోచినా ఆయన నన్ను చెప్పనిచ్చి వుండడు. తరువాత, కాలప్రవాహంలో చలనంలేని పర్వతాలు ధర్మాలని, ఒకొక్క ప్రదేశంలో ఒకొక్కప్పుడు ఒకొక్కలాగా వుండే గట్లు కట్టుబాటులని నాకనిపించింది.

రఘు నాకప్పుడప్పుడు చెప్పినదాన్నిబట్టి నాకు తెలిసిన విషయాలివి. అతనికి భార్యతో కలిసి భోంచెయ్యడం ఇష్టం కాని సుబ్బారావుగారి దృష్టిలో భర్త అత్త మామలు భోంచేసాక తినడం ఉత్తమురాలైన కోడలి పద్ధతి. అల్లా అని రఘు భార్యని ఎవరూ కోడంటికం పెట్టలేదు. అందుకని రఘు భార్యకి తను పొందలేకపోతున్నదేదో తెలియదు. రఘుకి తెల్సు. కాని అతను పెద్దల పట్ల గౌరవం కలిగివుండటమనే నియమానికి బానిస. అందుకని అతను తన జీవితాన్ని తనకి కావల్సినట్టు తీర్చి దిద్దుకోలేదు. రఘుకి డైనింగ్ టేబులు ముచ్చట. కాని కొంటే దానిమీద తినే దెవ్వరు? రఘుకి తన భార్య తన స్నేహితుల్ని పలకరించాలని ముచ్చట. కాని అత్త మామల మధ్య ఒద్దికగా కాపురం చేసుకునే కోడలు నలుగురితో కబుర్లేసుకుని కూర్చోడానికి అవుతుందా? పనుండదూ! ఇద్దరు పిల్లలు చాలని రఘు అభిప్రాయం. కాని రఘు భార్య ఒప్పుకోలేదు. దేముడు నిర్ణయానికి వ్యతిరేకంగా ఏ పని చెయ్యకూడదన్నది ఆమె అభిప్రాయం. ఆమెకు అత్తగారు 'అబ్బాయి ఇచ్చాడు కదా అని ఏ మాత్రలూ మింగకు.' అని నూరిపోసింది. నాతో పరిచయం కలిగాక దేముడు అందరికీ పిల్లల్నివ్వడని బుజువు చేయటానికి వాళ్ళకి ఉదాహరణ దొరికింది. రఘుకి తన పెళ్ళాంతో అందరిలాగానే సినిమాకి వెళ్ళాలని కోరిక. కాని ఆమె అతని తల్లితో సినిమాకి వెళ్తుంది. రోజంతా ఆమె అతనికి సరిగా కనిపించదు. రాత్రి మాత్రం నెల కిరవై ఏడు రోజులు పూలు పెట్టుకుని, తెల్ల చీర కట్టుకుని అతను నిద్రపోయేసరికి తెమిలి వస్తుంది. రఘు భార్యని ఆమె తల్లిదండ్రులు బోధించిన సూత్రావళికీ ఇక్కడ అత్త మామలు చెప్పేదానికి తేడా లేకపోవడంవల్ల ఇది బాధించలేదు. ఆమెకు తనకి తన ముందర తరానికి ఒక తరం తేడా ఉందని రఘు అభిప్రాయాలు. తన తండ్రి మామగార్ల అభిప్రాయాలు ఒక్కలాగానే వుండక్కరలేదని తట్టదు. అందుకని అతనిల్లు బయటివారికి స్వర్గంలాను అతనికి నరకంలాగాను కనిపిస్తుంది.

క్రమంగా రఘు తన యింట్లో అందరి పట్ల విసుగు ప్రదర్శించడం మొదలు పెట్టాడు. అతను కాలానికి ఎదురీది అలిసిపోయాడు. అతను కాలప్రవాహం ఎక్కడికి తీసుకువెళ్తే అక్కడకువెళ్ళే దశకి వచ్చాడు. ఒక యేడాది తరువాత అనుకుంటాను. రఘు యింటికి వెళ్ళి 'రఘు ఉన్నాడా అండీ?' అని నేనడిగితే 'శని ఆదివారాలు



ఆయనింట్లో ఉండి చాలా రోజులైంది' అని అతని భార్య జవాబు చెప్పింది. ఇంతట్లో సుబ్బారావుగారు 'ఏమిటా జవాబు!' అని కోడల్ని విసుక్కోడం, ఆమె 'నేనేం తప్పు మాటన్నానూ?' అని సాగదీసుకోడం లోపల నుంచి వినిపించాయి. కాస్సేపటికి సుబ్బారావు బయటికి వచ్చి నన్ను లోపలికి రమ్మని పిలిచారు. నేను లోపలికి వెళ్ళి కూర్చున్నాక సుబ్బారావుగారు 'బాబు! ఈ మధ్య మా రఘు చాలా మారిపోయాడు. ఇంటిపట్టున ఉండటం లేదు. ఎవత్తెనో తెచ్చి పెట్టుకున్నాడు పిఠాపురంలో. వీలు దొరికితే చాలు అక్కడికి పోతున్నాడు. పెళ్ళాం, పిల్లలు, తల్లీ దండ్రి అందరూ ఉన్నవాడికి ఈ బుద్ధులేం బాగుంటాయి. నా మాటకి గౌరవం ఇవ్వడు. అడిగితే ప్రశ్నకి జవాబు చెప్పడు. మా కోడలు వాడింటికి వస్తేనే వాలు పోట్లాటేసుకుని కూర్చుంటుంది. ఒకవేళ మగాడు చెడు మార్గంలో పోతే సరిదిద్దుకుని మంచి దార్లో పెట్టుకోవాల్సిన బాధ్యత భార్యదికాదూ. పోట్లాటేసుకుంటే మరింత విసుగొచ్చి మగాడన్నవాడు దూరంగా పోతాడు. పైగా మేము కూడా వాడితో పోట్లాడమని కోడలు మాతో పోట్లాడుతోంది. చిన్నప్పుడైతే కేకలు వేయగలం కాని పెద్దయ్యాక వెయ్యలేం కదా! ఇంట్లో సుఖం ఉందని అనిపిస్తే కదా వాడు ఇంట్లో ఉంటాడు. మా కోడలు కూడా మారింది. పూర్వం ఉన్న వినయం ఇప్పుడు లేదు. ఐనా వాడు మమ్మల్ని గౌరవిస్తే కదా, వాడిని బట్టి కోడలు గౌరవం ఇస్తుంది. మా సంసారాని కిల్లాంటి శనెందుకు దాపురించిందో! విధి బాబూ విధి!' అని బాధ వెళ్ళబోసుకున్నాడు. ఆయన ముఖంలో అలసట స్పష్టంగా కన్పిస్తోంది. ఎవరైనా సరియైన సమయంలో వాళ్ళు చేసి వుండవలసిన పని చెయ్యకపోతే ఆ తరువాత వారికి విధిగురించి మాట్లాడాల్సిన అవసరం వస్తుందని నా నమ్మకం. రఘు కింట్లో దొరకనిది వీధిలో వెతుక్కున్నాక గాని ఆయనకి విధి గుర్తు రాలేదు. కాలానికి ఎదురీది అలిసి పోయిన ఆయనకి ఈ విషయంలో రఘుకి నచ్చచెప్తానని నేమాట ఇచ్చాను.

కొన్ని రోజులకి ఇద్దరం ఖాళీగా ఉన్న మధ్యాహ్నం రఘుని నా రూములో కాఫీకి పిల్చి 'నీకేదైనా ఇంట్లో నచ్చకపోతే వాళ్ళకి










'చెప్పే నీకు కావలసిన విధంగా చేయించుకోవాలి గాని...' అంటుండగానే రఘు నా మాటను తుంచి—

'చెప్పే వారెవరూ! రెండు మూడు సార్లు చెప్పి చూసాను. ఆ ఇంట్లో ఎవరూ నా మాట పట్టించుకోలేదు. ఆఖరికి మా ఆవిడకూడా. అత్త మామల అండదండలతో నన్ను నిర్లక్ష్యం చేసింది. నేను ఎక్కడికీ పోకపోతే నేను తన కక్కరలేదు. ఇప్పుడు నేనింకొకళ్ళకి కావాలి గనుక తనకి కావాలి. మా నాన్నగారు డైనింగ్ టేబుల్ పై భోజనము చేయకుము అన్నది, దొంగతనము చేయకుము అన్నది చెప్పినంత గట్టిగా చెప్తారు. ఇవన్నీ మార్పు సహించని జీవన సూత్రాలు మా ఇంట్లో. నేను ఓపికున్నన్నాళ్ళు భరించాను. నాకింక ఓపిక లేదు. నేను ఓడిపోయాను' అన్నాడు రఘు.

'అందుకని బుద్ధిమంతుడివి చదువుకున్నవాడివి అయిన నువ్వు పిఠాపురంలో [illegible]నో ఉంచుకుంటావా?' అని నిలదీసాను.

'అప్పుడే నీవాకా వచ్చింది! మా ఇంట్లో వాళ్ళకి నేనామెను వుంచుకున్నానని అభిప్రాయం. నేనామెను వివాహం చేసుకున్నాను. నాకు మొదటిభార్యంతో ఈమె కూడా అంతే.' అన్నాడు రఘు.

గవర్నమెంటుద్యోగంలో వున్నవాడివి [illegible] పనిచేస్తే వుద్యోగం ఊడదూ!'

'భారతదేశంలో ముస్లిమ్‌లకా బాధలేదు. నేను పెళ్ళినాటికి ముస్లిమ్‌ను' అంటూ రఘు నవ్వేసాడు. ఆశ్చర్యపోయాను. నాకు లా గురించి తెలియదు. కాని అది రఘు చెప్పినమాట. ఆపైన రఘు 'ఆమెవరో తెలిస్తే నువ్వు, ఆమెను వుంపుడుకత్తెగా ఊహించవు!' అన్నాడు. 'ఎవరని!' అడిగాను.

'సుశీల, మీగారి అమ్మాయి. సత్యనారాయణగారి కూతురు. తను మనకాలేజీ ఫోటో చూసి నువ్వు తనకి బాగా తెలుసు అని చెప్పింది.' అని చెప్పాడు రఘు.

తల తిరిగింది. సుశీల రఘుకి రెండో భార్య అయిందా?, అం[illegible]లోను మొదటామె బతికుండగా. నాకాశ్చర్యం కలిగింది. సత్యనారాయణగారెలా ఒప్పుకున్నారో! [illegible]కని కుతూహలం ఆపుకోలేక అతన్ని వివరాలు చెప్పమని అడిగాను.

# ఎదురీత

'నేనే నీకెలాగో ఈకథ చెప్దామనుకుంటున్నాను. నువ్వుతప్ప ఎవ్వరూ సరిగ్గా అర్థం చేసుకోరని నా నమ్మకం. నేను కొన్నాళ్ళక్రితం అంటే రెండేళ్ళక్రితం మీవూళ్ళో పనిచేస్తూ వుండేవాడిని సత్యనారాయణగారి కుటుంబానికి నేను వైద్యం చేస్తూ వుండేవాడిని. సుశీలెప్పుడూ ఆ ఇల్లు పువ్వులా వుంచేది. నీకు తెలుసుగా శుభ్రతంటే నేనెంత పడిచస్తానో. అందుకని నేను వాళ్ళింటికి అవసరానికిమించి వెళ్తూ వుండేవాడిని. నిన్న మొన్నటివాకా నాకు శ్రీరామచంద్రుడన్న పేరున్న విషయం నీకు తెలిసిందే అందుచేత నేను సత్యనారాయణగారింటికి తరుచు వెళ్ళటం గురించి ఎవరూ తప్పు పట్టించుకోలేదు.

## దీప్తరేఖ

వెన్నెల వెల్లు వెల్లువల వెంట వెలంది
విరాళి వేడెనో
ప్రన్నని మిన్నుక్రొన్ననల బన్నము
చెన్నుగ మాన్పనెంచెనో
సొన్నపుజిల్గు సోన పొగసుంబ నచిందగ
నేమొ! పోయెపో
వెన్నుడు ముద్దరాలు వెనువెంబడి రా
తిమిరమ్ము ద్రుంపగన్

నవ్వులు—దివ్వెలు—తారా
జువ్వలు— క్రొవ్వెల్గు మువ్వజువ్వలు—
రవ్వల్
తువ్వర నవ్వడులుర్విని
నివ్వటిలెన్ జనుల కచ్చనివ్వాళికలై..

ధ్వాంతాక్రాంత నిరాశా
స్వాంతాక్లాంతము—దురంతసంతప్త క్లి
ష్టాంతర్గత వేదనము—ని
తాంత స్ఫూర్తిప్రభల పటాపంచలయెన్!

కాంతుల్ దొంతరగ పొలచె
కాంతల్ కుంతలములందు కైసేసిన వ
ల్యాంత కమనీయ కరణిన్
శాంతికి చిహ్నముగ పొలచె జయ
సూచకమై!

నిభిడ తిమిర జగతికి సందీప్తరేఖ
అతివ—అబలకాదు సబలయను పతాక
స్వప్నజీవుల ముత్యాల స్వర్ణరేఖ
దివ్య దీపావళి మహమ్ము దివికిజోక...!

—'సౌంధ్యశ్రీ'

ఆ రోజుల్లో నాకు సుశీలంటే అభిమానం మించి అనురాగంలేదు. ఆమెకూ నాకు జీవితంలో పోలిక కనిపించేది నాకు. మా ఇద్దరి విషయంలో నిర్ణయాలు తీసుకోడం మా తండ్రులవంతు. ఆచరించటం మావంతు. బర్డ్స్ ఆఫ్ ది సేమ్ ఫెదర్! కాని ఆ రోజుల్లో నా కర్థంకానిది ఇరవైయేళ్ళు వచ్చినా సుశీలకు పెళ్ళికాకపోడం. నాకేం తెలుసు రెండు సంవత్సరాల తరువాత నా భార్యగా అవటంకోసం నిరీక్షిస్తోందని. అప్పట్లో ఆమె జీవితానికి లక్ష్యం తండ్రికి అన్నం వండిపెట్టడం. ఆ క్రితం సంవత్సరమే ఆమెతల్లి చనిపోయిందిట. నాకు కొద్దిరోజులకే కాకినాడకి ట్రాన్స్‌ఫర్ అయింది.

'క్రితం సంవత్సరం సత్యనారాయణగారికి బాగా జబ్బుచేయటంవల్ల ఆయన్ని తీసుకుని కాకినాడ వచ్చారు. ఆ రోజున అక్కడ నేను డ్యూటీలో వుండటం విధి విలాసం. ఆస్పత్రికి సత్యనారాయణగార్ని తీసుకువచ్చిన సుశీలకి ఆయన దక్కకపోయినా ఆమె నాకు దక్కింది. సత్యనారాయణగారు పోగానే ఉద్యోగం, చెప్పకో దగ్గ ఆస్తి, ఆదుకునేందుకు మగతోడు లేని సుశీల భోరుమని ఏడ్చింది ఎందుకో నీకేం భయంలేదు. నేనున్నానని చెప్పాలని అనిపించి దగ్గరకి తీసుకున్నాను. ఆక్షణంలో ఆమె నా గుండెలమీద తలపెట్టుకుని సేదతీరింది. ఆమె నాకు దగ్గిరగా వుంటే నాకు చేతనైనంత సహాయం చేయొచ్చుకదా అని ఆమెను పిఠాపురంలో వుంటావా అని అడిగాను. సరేనంది. మీ ఊళ్ళో వాళ్ళకున్న ఆస్తి, అయిన కాడికి అమ్మి ఆ డబ్బుతో పిఠాపురంలో ఆమెకు ఇల్లు కొనిపెట్టాను. ఆ ఏడాదిలో నామీద కృతజ్ఞతగా ఆరాధనగా [illegible] సుశీలంటే నాకు ప్రేమ కలిగింది. ఆమె నాకేసి కళ్ళు పెద్దవి చేసి గౌరవంగా చూస్తుంటే నాకు గర్వం కలుగుతుండేది. అందుకని ఆమెను పెళ్ళి చేసుకున్నాను. ఆమెవరో ఇక్కడివాళ్ళకి తెలియక పోవడంచేత ఎవరో [illegible] స్త్రీ అని ఇల్లు నేను కొని పెట్టినదని చెప్తున్నాను. అదీ కథ. వీలైనప్పుడో సారి పిఠాపురం వెళ్ళి పలకరించమని రఘు నన్ను కోరాడు.

నేను మరో నెలకిగాని పిఠాపురం

వెళ్ళ లేకపోయామే. సుశీల ఇల్లు పువ్వులా ఉంచింది. అది నన్నాశ్చర్యపరచలేదు. ఆమె వేషం నన్నాశ్చర్య పరిచింది. ఆమె చాలా నాగరికంగా తయారైంది. పూర్తిగా ఇటున్నవాళ్ళే పూర్తిగా అటుకి మారగలరు. ఉయ్యాలూగేటప్పుడు మొదట ఇటు ఎంత దూరంగా ఉంటే అటు అంతదూరానికి వెళ్తాం. మధ్యకి కొద్దిగా ఇటున్నవాళ్ళు అటు వెళినా కొద్దిగానే వెళ్తారు ఆమె వేషం చూసిన ఏ తూర్పుగోదావరిజిల్లా మనిషైనా ఆమెను మంచిగా వూహించుకోడు. ఆ చుట్టుపట్ల వాళ్ళు హీనంగా చూసేలాంటి ఆడవాళ్ళెక్కువ. అంతగా నవ నాగరికంగా తయారైన సుశీల నన్ను చూడగానే ఏడ్చింది. తరువాత తనకథ చెప్పింది. సుశీల చెప్పినదాని ప్రకారం సుశీల ఎంతసేపూ తన తండ్రి అభిప్రాయాలే తన అభిప్రాయాలని తన్ను తాను నమ్మించుకుని ఆత్మవంచన చేసుకుంది. నిజానికి తనకి సుగుణం పై అసూయ తను అల్లా చదువుకోలేక పోయినందుకు బాధ— కాని ఆ విషయం తనే నమ్మలేనంతగా సత్యనారాయణగారి ఆలోచనా సరళి ఆమె మీద ప్రభావం కలిగివుండేది. మారిన విలువల్ని గుర్తించలేని బలహీనతవల్ల విలువలు మారలేవని భ్రమ కల్పించుకునేది. 'ఆఖరికి నువ్వు నన్ను పెళ్ళి చేసుకో మన్నప్పుడు మనకులాలు వేరుకనుక మానాన్న వప్పుకోడన్న భయంవల్ల నువ్వంటే నాకిష్టం లేనట్టు నన్ను నేను నమ్మించుకున్నాను. మానాన్న జబ్బుకి కారణం తెల్సా? తను నాకు పెళ్ళి చేయలేక పోతున్నానన్న దిగులు. ఆఖరికి చదువైనా చెప్పించనందుకు ఆయన అంతరాత్మ ఆయనకి విధించిన శిక్ష, బెంగ, కాని ఎదురీత ఈదక అలిసిపోయి చచ్చిపోయాడు మానాన్న' అని సుశీల ఒకక్షణం ఆగి మళ్ళీ మొదలుపెట్టింది.

'మానాన్న చనిపోయినరోజు రఘుగారు కౌగిలించుకున్నప్పుడు మానాన్న చనిపోయి సరిగా గంటైనా కాకుండా నాకు జీవితంలో లభించిన మొదటి వెచ్చని కౌగిలి సుఖంలో తన్మయత్వం చెందాను. ఆరోజే మనం ప్రవాహంలో ఎదురీదటం కంటే కొట్టుకుపోవడమే హాయని నిర్ణయించుకున్నాను. ఇది నన్ను నీతిరానికి చేర్చినా నాకు సంతోషమే. ఆయన మొదటిభార్యను నేను అన్యాయం చేస్తున్నానన్న ఆలోచన వచ్చినా దాన్ని దూరంగా నెడుతున్నాను. నాకు మిగిలిన కొద్ది వయస్సును పుణ్యపాపాల తర్కాలతో గడపాలని నాకులేదు.' అని సుశీల తనకథ ముగించింది.

మరో యేడాదికి సుశీల కొడుకును కన్నది. రఘు సంతోషించాడు. అప్పటి నుంచి సుశీలలో అసంతృప్తి మొదలైంది. రఘు మిగిలిన పిల్లలకి లాగానే తన కొడుక్కి రఘు పేరు గౌరవం కావాలని కోరటం మొదలు పెట్టింది. సంఘం తన్ని రఘు ఉపపత్నిగాగాక ధర్మపత్నిగా గుర్తించాలన్న తపత్రయం మొదలైంది. దానికోసం అత్తమామలకి, ఆఖరికి సవతికికూడా సేవలు చెయ్యటానికి సిద్ధపడింది. కాని రఘు మొదటి భార్య 'ఎప్పటికైనా అసలుదాన్ని నేను. మధ్యలో వచ్చింది అలాగే పోతుంది.' అని మొండికేసింది. రఘు క్షణిక స్వర్గం ఎగిరిపోయి రెండు నరకాలు ఏర్పడ్డాయి. తనకి కాల ప్రవాహం ఈదటానికి దొరికిన గడ్డిపోచలాంటి రఘుని సుశీల వదలదు. తన స్థానం తన పిల్లలస్థానం తప్ప సుశీల విషయం పట్టదు మొదటి ఆమెకు. సుశీల కొడుకు విషయంలో అప్పుడే చుట్టూవున్న వాతావరణం చిన్నచూపు చూడటం మొదలు పెట్టింది. ఈ రంపపుకోత భరించలేక తన మూడు నాళ్ళ ముచ్చట కాపురానికి భరతవాక్యం పలికి ఆత్మహత్య చేసుకుంది సుశీల.

సుశీల మరణంతో రఘు పరిస్థితి మరీ దారుణంగా తయారయింది. ఊహానూ చూస్తూ కృష్ణుడిని అనాథ ఆశ్రమంలో చేర్చలేడు. ధైర్యంచేసి ఇంటికి తీసుకు వెళ్ళలేడు. అప్పుడతనికి సంతులేని మేము కనిపించాము. మమ్మల్ని తన కొడుకుని పెంచుకోమని కోరాడు. సరేనన్నాం. అయితే రేపు రఘు తనకి కొరివి పెట్టేవాడికోసం వెతుక్కునే రోజులువస్తే కృష్ణుడు గుర్తుకువచ్చే అవకాశం ఉందిగనక ఆ ప్రమాదం జరగకుండా కృష్ణుడిని మేము శాస్త్రోక్తంగా దత్తత చేసుకున్నాం. దేముడు ఆఖరికి చల్లనిచూపు చూపాడని వరలక్ష్మి సంతోషించింది. కొడుకు దొరికాక వరలక్ష్మికి అంతగా పుట్టింటిగాలి అవసరం లేకపోయింది. కృష్ణుడికి కాకినాడ గాలి పడదు అందుకని నేను అప్రాంతమునించి దూరంగా బదిలీ చేయించుకున్నాను.





# [illegible] ఎక్కడికి?

మహీధర రామమోహనరావు

### జరిగిన కథ

పెళ్లయిన కొన్నాళ్లకే జానకి భర్త ఏమైపోయాడో తెలియలేదు. జానకి మాత్రం గుండె రాయి చేసుకుని బొంబాయిలోనే స్థిరపడిపోయింది. ఆమె కొడుకు రవీంద్ర. రెండు దశాబ్దాల తర్వాత ఆ ఫూళ్లో అడుగు పెట్టింది జానకి. సత్యానందం గారింటికి వెళ్లింది. భద్రక్కగాని, సత్యానందం గాని ఆమెని గుర్తు పట్ట లేక పోయారు. తెలిసిం తర్వాత సంతోషం పట్టలేక పోయారు. మనుమడు రవీంద్రకి స్థిరాస్తిగా కొంత పొలం యివ్వటానికి నిశ్చయించుకుంటాడు కుమారస్వామి. సత్యానందం కొడుకు రామకృష్ణ వచ్చాడని తెలిసి జానకి, రవీంద్ర, భద్ర యింటికి బయలుదేరారు. చదువుకుంటున్న రామకృష్ణ నక్సలైట్లతో చేరతానంటాడు. జోగన్న తన చర్యలని పార్టీ సమర్థించాలన్నాడు. సుందరరావు అతని ఉద్రేకాన్ని చల్లార్చాడు.

## 20

సత్యానందం నూతి పెరట్లో ముఖం కడుక్కుంటూ ఉంటే సరస్వతి వచ్చి కబురందించింది.

'మీ కోసం ఎవరో వచ్చేరు, మావయ్యగారూ!'

'కూర్చోమను అమ్మా! వస్తున్నా'

'సావిట్లో కూర్చోబెట్టేను.'

అతడు వేవేగ ముఖం కడుక్కుని అంత ప్రొద్దున్నే వచ్చిందెవరా అనుకొంటూ సావిట్లో అడుగు పెట్టేసరికి జోగన్న బల్లమీద కూర్చుని ఉన్నాడు. సత్యానందాన్ని చూడగానే ఉలికిపడ్డట్టు లేచి, చేతులు జోడించి దండం పెడుతూ జోగన్న ఏడుస్తూ వచ్చేడు.

'బుద్ధి గడ్డి తింది. క్షమించండి—అని అడగడానిక్కూడా సాహసం చెల్లడం లేదు. క్షమించేరంటే తప్ప, పిల్లలవాణ్ణి బతకను...'

గిడ గిడ లాడుతూ. పశ్చాత్తాప-ఖిన్న మూర్తిలా జోగయ్య వచ్చి తన కాళ్ళమీద పడిపోతూ ఉంటే, సత్యానందం చటుక్కున వెనక్కి తగ్గి, అతని భుజాలు పట్టుకొని నిలబెట్టేడు.

'ఏమిటీ అన్యాయం. నాకేం అన్యాయం చేశావని నిన్ను క్షమించడం? బాగుంది. ఇది మరీ బాగుంది. మీ పిల్లలకేం వచ్చింది? అంతా బాగున్నారా?'...

తన పిల్లలకేం కాలేదని జోగన్న చెప్పేడు. తుపాను బాధితులు ఇళ్ళు వేసుకొనేందుకు ప్రభుత్వం ఇస్తానన్న డబ్బు కోసం దరఖాస్తు పెట్టేడు. తాశిల్దారు వచ్చి సాయంకావలసినవాళ్ళ పేర్లలో తనదీ చేర్చేడు.

'మరింక నేం. ఫర్వాలేదు. ఈ లోపున కావలసిన సాయం...'

మళ్ళీ జోగన్న దండాలు మొదలు పెట్టేడు.

'మీ మనస్సు అంత గొప్పది. తెలుసుకోలేకపోయేను. వెధవని. సుందరరావు ఇశారా ఇస్తే, ఏదో గొప్ప పని చేస్తున్నాననుకొని, రాయి విసిరి, మీ వీధి లైటు బద్దలు కొట్టేసేను. అని చెప్పేడు. నేను విన్నా. వెధవని, కుంకని...'

జోగయ్య ఛటఫటా చెంపలు వాయించుకుంటూ ఉంటే, సత్యానందం చటుక్కున ఆతని చేయి పట్టుకొన్నాడు.

'ఓస్. అదా! దానికింత బాధ పడాలా? ఏమీ లేదు అప్పుడే మరిచిపోయా. పైగా నువ్వు విసిరినట్టు నేను చూడలేదు. అనుకోలేదు...'

'మీ మనస్సు గొప్పతనం అది. చవట పీనుగుని కానలేకపోయేను.

'ఇంక మళ్ళీ అవేం చెప్పకు. అలా చెయ్యడం తప్పని తోచింది. చాలు. మళ్ళీ అలాంటివి చెయ్యకపోవడమే...'

మాట మధ్యలోనే జోగన్న అందుకొన్నాడు: 'ఇంకానా?...ఇంక అలాంటి వెధవపని చేస్తానా? ఇంక ఆ అనుమానం తగిలితే చెప్పుచ్చుకు కొట్టండి. ఇంక అలాంటిపనులు చెయ్యమనే వాళ్ళతో ఏమీ సంబంధం పెట్టుకోను. మీకు వ్రాసి ఇస్తున్నా...'

జోగయ్య జేబులోంచి ఒక కాగితం మడతతీసి, విప్పి, సత్యానందం చేతికిచ్చేడు:

'చిత్తగించండి. దీనికలు సుందరరావు. ముఖాన కొట్టివచ్చేను. నేను మీ పార్టీలో చేరిపోటానికి వచ్చేను...'.

సత్యానందం ఉలికి పడ్డాడు:

'ఇప్పుడు ఆ ప్రసక్తి ఏం వచ్చింది? సావకాశంగా ఆలోచించుకో. తొందరవద్దు.'

గ్రామంలో రౌడీగా. చంపడానిక్కూడా వెనుతియ్యనివాడుగా ప్రసిద్ధి, స్వానుభవమూ వున్నా, 52 ఎన్నికలలో తనతో పనిచేసినాక జోగయ్యను పార్టీలో చేర్చుకొన్నారు. కూడదన్నవాళ్ళు. 'ఎప్పుడో తప్పుచేసినందుకు గాను మరి బాగుపడే అవకాశం లేకుండా చెయ్యరాదన్న' సమాధానంతో గమ్మునైపోయారు. ఆతనిని పార్టీలో చేర్చరాదన్న వారిలో సత్యానందం ఒకడు. పార్టీ విడిపోయినప్పుడు అతడు మార్క్సిస్టుల వెంటబోవడం కమ్యూనిస్టుపార్టీ అదృష్టంగా భావించిన వారిలో అతడొకడు. ఇప్పుడు తిరిగి వస్తానంటూ ఉంటే భయమే అనిపించింది.

'మనవి రెండూ ఏకలక్ష్యంగల పార్టీలు. ఇప్పుడు ఏవో విభేదాలు...'

'చెప్పేరుకాదా! బుద్ధి గడ్డి తిని మార్క్సిస్టులతో చేరేనని...వాళవలన దేశం ఉద్ధరించ బడుతుందని భ్రమ



పడ్డా? వాళ్ల విన్నపపదజాలం చూసి మోసపోయా...'

జోగయ్యను బాగా ఎరిగిన సత్యానందం ఆ ఆత్మ విమర్శకు ఉబ్బితబ్బిబ్బుకాలేదు పైగా కొత్తచిక్కులు ఎదురుకాగలవని భయపడ్డాడు. ఇల్లాంటి ఫిరాయింపులకు బ్రహ్మానంద పడేవాళ్ళ చేతిలో కాగితం పడితే, కళ్ళకద్దుకొని విశాలాంధ్రకు పంపేస్తారు' వాళ్ళు గుడ్డిగా వేసేస్తారు, ఇంక ఇక్కడుంటాయి తమపాట్లు!' వూళ్లోవాళ్లే కాదు. జోగయ్యే తమమొహాన ఉమ్మేసినా వేస్తాడు.

జోగయ్యకు తనస్థానం, దానికిగల బలం బాగా తెలుసు. తన చేతిలోని కాగితం చదివి వినిపించసాగేడు...

'కమ్యూనిస్టుపార్టీ ఉమ్మడి పార్టీగా కలిసి వున్నప్పుడే — ఇప్పటికి దరిదాపుగా పదిహేనేళ్ళనుంచి నేను పార్టీ సానుభూతిపరుడుగా, పార్టీ సభ్యుడుగా వుంటున్నా; అంతకు పూర్వం కూడ ప్రజాజీవన సాధనాలన్నింటినీ బూర్జువా, భూస్వామి వర్గాలూ, వారి పీడితొత్తులుగా బ్రతుకుతున్న కాంగ్రెసు ప్రభుత్వం తమ చేత బట్టుకొని, దేశంలో అనేక కోట్ల మందిని బాహిరంగా తన ఇనప పిడికిలితో పట్టి వుంచినట్టే నన్నూ నొక్కి వుంచినా, నా మనస్సు, నా ఆత్మ విప్లవ పార్టీ అయిన కమ్యూనిస్టుపార్టీతోనే వుంది. 1952 ఎన్నికలనుంచి నావోటు కంకి, కొడవలికే పడింది...'

సత్యానందం ఏదో అనాలి గనక, 'ఔనౌను. నాకూ గుర్తుంది' అన్నాడు. ఆ ఎన్నికలలో జోగన్న ఎన్నికల క్యాంపులో వలంటీరుగా వున్నాడు. ఆ మాట అన్నాక తన పొరపాటు గుర్తువచ్చింది. ఏలా సర్దుకోవాలో తోచక కంగారు పడ్డాడు. కంగారు కప్పి పుచ్చుకొనేందుకు పొడిదగ్గు నటించేడు.

జోగయ్య తన వ్రతంలో మాటలకి ముఖతః వివరణ నిచ్చేడు.

'నాబోటి సందిగ్ధాత్మకులకి మీరే దారిచూపేరు. ఆగడ్డు నిర్బంధపు రోజుల్లో కమ్యూనిస్టు పేరుచెప్తే పట్టుకుపోయి కాల్చివేస్తున్నరోజుల్లో మీరు బాహాటంగా ప్రకటనచేసి 'కమ్యూనిస్టుపార్టీతో చేరుతున్నాను. ఏం చేస్తారో చెయ్యండి'



# ఈదారి ఎక్కడికి?

అన్నారట. ఆనాటికి మీకు కమ్యూనిస్టుల మీద విశ్వాసంలేదు. విశ్వంగారిని అన్యాయంగా కాల్చివేసినందుకు అసమ్మతిగా మీరు ప్రకటన చేశారు. చేరేరు...'

'మీకు 1950 నాటికి కమ్యూనిజం మీద విశ్వాసం ఏర్పడిందని. వారి పంథా మార్గమే నచ్చలేదనీ చెప్పారని వన్నా జోగయ్య మాటలకి తాను సమాధానం చెప్పకపోవడం ఇష్టంలేక సత్యానందం తెరిచిన నోరు మూసేసుకొన్నాడు.

జోగయ్య తన ధోరణి సాగించేడు.

'దేశ భవిష్యత్తు కమ్యూనిస్టుపార్టీతోనే వుందని నమ్ముతున్నా, భయంతో మూల ఒదిగి కూర్చున్న మాబోటిగాళ్లకి, మిమ్మల్నీ, మీ సాహసాన్నీ చూసేసరికి, కనువిప్పు కలిగింది. మీరు మాకు 'మార్గదర్శి మహాశయ!' '...

తన మాటల ప్రభావం సత్యానందం మీద ఏ విధంగా వుంటుందో గమనించటానికి, ఒక్క నిముషం ఆగి, అతని ముఖం లోకి చూసేడు.

జోగయ్యకు తాను మార్గదర్శి నయ్యానన్నది గర్వం కలిగించటానికి బదులు సత్యానందానికి అసహ్యం కలిగించింది. కాని ఏమీ అనలేకపోయేడు.

'మీబోటి అసలు, సిసలు అభిమానులంతా పార్టీలోకి వచ్చాక కూడా, అందులో వుండడానికి ఏ మాత్రం అర్హతా లేని మాబోటిగాళ్ళు దానిని వదల లేదు. దానికి గబ్బు పట్టించాం. మీబోటి మార్గదర్శి బయటికి పోయేలా చేశాం. ఇంత చేసినా నన్ను 'మార్గదర్శిమహర్షీ' అంటున్నావంటే...'

దానిని అవహేళనగా భావించే అవకాశం, అవసరం జోగన్నకు కనబడలేదు.

'దీనికింకేమంటారు? మాకు వింత భక్తి విశ్వాసాలు పార్టీమీదున్నా మంగళి మంత్రిత్వం దొరికింది. గాడిదలకి న్యాయ కత్తులు ఇచ్చి గంగిరెద్దుల్లా తలలు గొరిగేం...'

ఆ సంభాషణ వెక్కసమనిపించి, సత్యానందం జోగన్న చేతిలోని కాగితం తీసుకొని పఠనంలో మునిగిపోయేడు. ఆఖరున మడిచి జేబులో పెడుతూ— 'పార్టీ శాఖ పెడుతున్నాను. నేనిది వుంచుకోవచ్చా?—' డు.

కివ్వడానికే తెచ్చేను. దయవుంచండి. నన్ను పరాయివాడుగా చూడవద్దు. మీలో కలుపుకోండి, అదీ నా ప్రార్థన.'

సత్యానందం ఒక్క క్షణం ఆలోచించేడు. అసలు విషయం చెప్పకుండా అతనిని ఆహ్వానించేడు.

'రాత్రి ఒక ముఖ్యమైన విషయం గురించి సమావేశం జరుపుతున్నాం. దానికి మవ్వూ...'

'రావచ్చునా?'

'పాన భూమినరుల్నే కాదు. కాంగ్రెసు వారిని సహా పిలుస్తున్నాం. మార్క్సిస్టు పార్టీ ముఖ్యుడివి, నీకు...'

జోగన్న మొగం ఇంత పొడుగుచేసి బన్ని మన్నాడు.

'ఆ పార్టీ వాడినని మీరనడం నాకు అవమానంగా భావిస్తా.'

సత్యానందం అది సరికాదన్నాడు.

'మీకు కనువిప్పు కలిగించిన అంశం ఏమిటో నాకు తెలియదు. అయినా పార్టీలతో మనకున్న అనుబంధాలు అంత సులభంగా తెంచుకోగలమా?'

తెంచుకోగలననడం అనిశ్చిత బుద్ధికి నిదర్శన అవుతుందేమోననే భయంతో జోగన్న దిగులు మొహం పెట్టేడు.

'అదీ నిజమే అనుకోండి. ఇదివరకు ఇల్లా చిన్నిమార్లు అనుకోలేదు. కాని చెయ్యగలిగేనా? అయితే ఈమారు పరిస్థితి వేరు. నేను నిశ్చయం చేసేసుకున్నా...'

'సరి, సరి. కాగితం చదివేను కదా. చూద్దాం. రాత్రి...'

'తప్పకుండా వస్తా.'

జోగన్న సెలవు దీసకొని గుమ్మందాకా వెళ్ళేడు. పొలం విషయం సత్యానందం తనకు తానే ఎత్తుతాడని తలుస్తే, అతడు మాట్లాడనేలేదు. ఇంక తానే ఎత్తాలి. చటుక్కున ఏదో జ్ఞాపకం వచ్చినట్టు ఆగేడు.

'ఒక సంగతి తెలిసింది.'

'ఏమిటది?'

'నేను కాపురంవుండి చేసుకుంటున్న బాడవ పొలం...'

'ఔను. కుమారస్వామిగారా పొలం మన మడికి వ్రాశారు, నిన్ననే సాయంకాలం టపాలో దస్తావేజు అందింది.'

'ఆయన నాకిచ్చేసిన పొలం అది...'

'నే నెప్పుడూ వినలేదే...'

'పెద్దవాళ్ళు ఏం చేసినా చెల్లుతుంది.' —అని జోగన్న తన వ్యథ వెలిబుచ్చేడు.

'ఈ వేళ సభ దానిని గురించే. ఆ కుర్ర వాడు తనకా భూమి అక్కర్లేదంటున్నాడు. పల్లెలవాళ్ల ఇళ్ళ స్థలాలకి కోరడం, తాశిల్దారు శాంక్షన్ చేయడం...'

'ఎప్పటి మాట అది. పదిహేనేళ్ళనాటి మాట...'

'ఔను, మళ్ళా చిరుగుదువు. పల్లెవాళ్ళ ఇళ్ళ స్థలాలకి ఇచ్చేస్తానంటున్నాడు ఆ కుర్రవాడు...'

'ఆ,' అన్నాడు, జోగన్న.

'ఔను. ఒక పార్టీ అనకుండా పల్లెలో ఇళ్ళు లేని కుటుంబాలవారికి ఇవ్వాలని అనిపించింది అతనికి. ఒక పద్ధతి ప్రకారం స్థలాలు కేటాయించడం. ఎందరికి కావలసి వుంటుందో...'

'అది నాకిచ్చిన భూమి...' అన్నాడు జోగన్న నీరసంగా.

## ఓం నమః శివాయ

కం. అరుణకాంతి వికాస
మాదరింపు ప్రగాఢ విశ్వాసము తోడన్
శంకింపకన్న, తేల్చుకొన్న
దీప్తి కణ, వీక్షణ, రూక్షణ వర్ధన్న.

కం. ఋ, ఋణ పడియుందు రుద్రునికి
ఋ,రూపు నిర్మాణవిరించితు నిర్ధారింతున్
ఋ, తృణీకరించలేను
ఋ, సృజించిన సృష్టికర్త రక్షించు
నన్ను రమ్యతన్.

కం. తెంతెంత తంటాలు తటస్థులై
తే, గణిత గుణిత యతి ప్రాసనెరుగనే
తై తికతత్త్వ మెరుగన్
తొండొరులకు విచిత్రభావ స్ఫూర్తి
సంక్రమించెన్.

కం. తోతో కవులు కంపితులై
తౌ తౌదురు తంటలు పడ్రదోతురందు
దుర్మతుల్
తంకిణి కింకణందురు నను
తఃహార హాస్యాస్పద సేయకు మయ్యో!

రచయిత్రి: శ్రీమతి సరస్వతీగిరి

'ఆ విధంగా కాగితం వుంటే తీసుకు రాండి. పేచీ పూచీ లేకుండా ముందే వర్తే సేస్తాం...'

జోగన్నకు ఏం తోచలేదు.

'మీటింగెక్కడ? ఎప్పుడు ?'

'రాత్రి తొమ్మిదింటికి స్కూలు దగ్గరే. పల్లె వాళ్ళు ఇంకా అక్కడే వున్నారు కదా. వాళ్ళందర్నీ మరో చోటికి రమ్మని (శమ పెట్టటం ఎందుకని...'

జోగన్న ఈమారు సెలవు తీసుకోడం మరిచిపోయేడు.

* * *

'ఇంత పొద్దుపోయి వస్తున్నారు, ఎక్కడి నుంచీ...'

'ఇనక మాడిలో న్యుమోనియా కేసుంది కదూ, వెళ్ళేసరికి కలరా కేసొకటి తెచ్చేరు.' ...అంటూ నడుస్తూనే రంగనాయకులు పరధ్యానంగా సమాధానం ఇచ్చేడు. అంతలో అడిగినదొక ఆడమనిషనీ, స్వరం ఎరిగినదే ననీ అంతరాంతరాలలో అనిపించి చటుక్కున ఆగి వెనుతిరిగి చూసేడు. సుశీల. తనను ఇంత పొద్దుపోయి వస్తున్నావందేగాని, ఆమెకూడా అంతేకదా.

'నువ్వు ఇంతదాకా హాస్పిటలులోనే వున్నావా ? ఏం కొత్తరోగులు వచ్చేరా ? వచ్చినా...'

తుపాను బాధితుల సహాయార్థం అన్ని పార్టీలవారూ కలిసి గ్రామంలో ఏర్పరచిన తాత్కాలిక వైద్యశాలలో సుశీల, రామ

# ఈదారి ఎక్కడికి?

కృష్ణ సహాయంతో పనిచేస్తూంది, ఈ నాలుగురోజులుగా. అది తన ప్రోత్సాహం తోనే ఏర్పడిందని తెలిసినా, కేవలం తమ పార్టీ పెత్తనంకిందలేదు. అధికార కమ్యూనిస్టుల స్థానిక నాయకుడు దాని ఏర్పాట్లు చూస్తున్నాడు. కనక తన తండ్రి అధీనం తరం వుంది. ఇంకా తాను ఆయనని తోసేసి బయటపడే మనస్థితిలో లేడు. తప్పదని పిస్తున్నా ఆయన బ్లడ్‌ప్రెషర్, ఆరోగ్యం దృష్ట్యా ఇంకా తొందరపడలేననుకొంటు న్నాడు. కాని, రోజూ ఏదో వేళప్పుడు వెడుతున్నాడు. సాయం చేస్తున్నాడు. సలహాలిస్తున్నాడు. ఈ రాకపోకలలో సుశీలతో సాన్నిహిత్యం పెంచుకుంటున్నాడు, ఇద్దరిమధ్యా వారంక్రితం వున్నదూరం తగ్గుతూంది. అదే అతనిగొంతులో ప్రతి ధ్వనించింది.

అతని కంఠంలోని ఆదుర్దా తనను గురించా, తుపాను తర్వాత గ్రామాలలో వ్యాపించగల వనుకొంటున్న అంటురోగాల్ని గురించా—అనుకొంది సుశీల.

'స్కూలులో పేటల వాళ్ళకి ఇళ్ళ స్థలాల కేటాయింపు గురించి నిశ్చయించ డానికి నలుగురూ చేరేరు. మీరు వస్తారని చాలసేపు చూసేరు. రాలేదు. మీపార్టీ వాళ్ళెవ్వరూ రాలేదు...'

తన ప్రశ్నకది సమాధానంకాదు. పైగా

మరో ఆరోపణ...

'మా నాన్నగారు...'

'లేదు.'

'జాన్?'

'వచ్చేదేమిటి? అక్కడే వున్నాడు. కాని, అంతవరకూ అక్కడున్న మీ పార్టీ వాళ్ళు సమయానికి వెళ్ళిపోయేరు...'

రంగనాయకులు ఏదో చెప్పబోయి వూరు కున్నాడు.

'అక్కడినుంచే వచ్చేవు కాబోలు, ఏం నిర్ణయించేరు ?'

'నువ్వే అక్కడికి వచ్చివుంటే మా నిర్ణయాలు ఇంకా సమగ్రంగా వుండి వుండేవి. ఇప్పుడు అరకొరగా వొదలవలసి వచ్చింది,'—అన్నమాటల వినబడేవరకూ అతడు సుశీల వెనక మరికొందరున్న విష యమే గమనించలేదు.

'మీరూ వున్నారా ?... ఇంక మనకి రాజకీయాలలో వేలు పెట్టాలనే ఆసక్తి లేదు. డక్టరు వృత్తిలోనే మనం చెయ్య గలదేదో చెయ్యడం...'

'ఆలాగని నారుకోగలిగేవా? పేటల వాళ్ళని హాస్పిటలులోకి తీసుకురావడం నీధర్మమే అని ఎందు కనుకొన్నావు?'— అంది జానకి.

రంగనాయకులు నిరుత్సాహంగా నిట్టూర్పు విడిచేడు.

'మనుష్యుడు అలవాట్లకి దాసుడు. అదే అతని బలహీనత...' అన్నాడు, రంగ నాయకులు.

'కాని, నీ విషయంలో ఆ బలహీనత జనానికి ప్రయోజనకరం. లేకపోతే ఏమవు తుందో ఆలోచించు. నీ వృత్తి ధర్మం తప్పకుండా నువ్వు చేస్తావు. కాని ఈ వేళ మన రోగాలలో మూడువంతులు దారిద్ర్య మూలకాలు. మనదేశ రాజకీయాలకి దేశ దారిద్ర్యానికీ వున్న సంబంధం ఎరిగినవాడివి...'

రంగనాయకులు చేయి విదిలించేడు.

'విరగుదుము. విరుగుదును కాని... వద్దులెండి. వదిలెయ్యండి మనకవి జీర్ణం కాలేదు...'

నాలుగైదు రోజులుగా అతని కుటుంబ వ్యవహారాలు వెలుము ఖాల వింటూ వస్తున్న జానకి అతని నిస్పృహకి కారణం గ్రహించ డం కష్టంకాలేదు. అతడి మార్క్సిస్టు పార్టీ పంథా తనకితాను దిగ్బంధం చేసేసు



కొంటూంది: ఆ దిగ్బంధంలో కాస్త ఆలోచించగల వాళ్ళకి ఊపిరి సలపడం లేదు. ఇదో రకమైన ఆత్మహత్య.

'ఏమో నయ్యా! మీరంతా ఇల్లా అనుకుంటున్నారు. దాని తో గోరంత పనులు కొండలంతయి కూర్చుంటున్నాయి. సరే ఇప్పుడీ వీధిలో చర్చలేమిటిగాని, భోజనం చేసేవా?'—అంటూ ఆమె సుశీల భుజం తట్టింది.

'భోజనమా?'—అని రంగనాయకులు జ్ఞాపకం చేసుకొనేందుకు ప్రయత్నించేడు.

'లేదనుకుంటా. లేదు. కాఫీ పదిమార్లు పడింది. ఇంక భోజనం ఏమిటి?'—అన్నాడు.

జానకి నవ్వింది. గట్టివాడివే భోజనం కూడా మరిచిపోయే స్థితికివచ్చే వన్నమాట. వ్యవహారం చాలా బాగుంది...సుశీలా! ముందు ఇంటికి తీసుకెళ్ళు ఆఖరికి ఇన్ని అటుకులేనా మజ్జిగలోవేసి ఇయ్యి...' అని ఏకటాకీన బండి దిగింది.

సుశీల సంకోచిస్తూనే ఆహ్వానించింది. నారంచాడు తాను విడాకులు తీసుకోమని అతనిని ప్రోత్సహించిన విషయాన్నీ, దానికి గల వైమనస్యాన్నీ ఆమె మరిచిపోలేకుండా వుంది. ఆ రెండు మూడు రోజుల్లో జానకి అవివేకం ఆలోచన వింత పొరపాటు చెప్పి వొప్పించినా, ఆ వొప్పుదలను కార్యరూపంలో పెట్టడం సాధ్యంగాలేదు. కాని, ఇప్పుడు జానకే చొరవ తీసుకోడంతో తప్పుకోలేక పోయింది.

'రాండి ఫలాహారమన్నా చేద్దురుగాని తరవాత మాట్లాడుకోవచ్చు. మీరుకూడా రాండి' అని పనిలోపనిగా జానకినికూడా ఆహ్వానించింది.

పదేళ్ళ వైమనస్యాలూ, మూడు నాలుగేళ్ళ ఎడబాటూ, ఘర్షణలతో నిండిపోయిన మనస్సులో ఆప్యాయత, చనువు, అధికారం చోటు చేసుకోలేకుండా వున్నాయి.

వారి మనస్థితిని అర్థం చేసుకొంది జానకి.

'నడవండి నడివీధిలో ఈ కబుర్లు బాగులేదు.'

రంగనాయకులు వారం క్రితం అనుభవంతో జానకి ప్రోత్సాహాన్ని వుపయోగించుకోలేక పోయేడు. తుపాను బాధితుల సాయంకోసం సుశీలను వచ్చి తన క్లినిక్‌లో పనిచెయ్యమన్నాడు గాని, ఆమె నిరాకరణను మరిచిపోలేదు. దేశంకోసం వస్తానంది.

'ప్రశ్నావళి' శీర్షికకి ప్రశ్నలను పంపేవారు కవరుమీద స్పష్టంగా 'ప్రశ్నావళి.' ఆంధ్ర సచిత్ర వార పత్రిక, మద్రాసు — 1.' అని వ్రాయకోరుతున్నాము.— సం॥





# ఈ దారి ఎక్కడికి?

వచ్చింది. ఆమె తనతో కలిసి పనిచేయడానికి ఒప్పుకుంటుందనుకో లేదు కాని ఒప్పుకొంది. వచ్చింది. ఆ రాక తనకోసం కాదని మొదటనే అర్థం చేసుకొన్నాక, అత్యవసరమైనంతవరకే ఆమెతో ప్రసక్తి పెట్టుకుంటున్నాడు. ఇవన్నీ జానకికి తెలియకపోవచ్చు. ఆమెయెదట ఏమీ అనలేక సుశీల నిలిచింది. ఆ స్థితిలో తాను ఆమెను చిక్కులో పెట్టకూడదనుకొన్నాడు.

'ఇంకాపోయి స్నానం చెయ్యాలి బట్టలు మార్చుకోవాలి ఇంటికిపోయి రేపు కనిపిస్తా. సెలవు.'

సుశీల ఒకమారు ధైర్యం చేసింది.

'మీ బట్టలు కొన్ని ఇక్కడే వున్నాయి. హీటర్‌లో నీళ్ళు కాగుతాయి. ఇప్పుడెళ్ళి చన్నీళ్ళు స్నానం చేస్తారా? మంచి మాటే...'

రంగనాయకులు కింకా ధైర్యం చిక్క లేదు. సందేహించేడు.

'ఇంత రాత్రివేళ అందరికీ అనవసర శ్రమ కాదూ.'

సుశీల అతని మనస్సు గ్రహించింది.

'శ్రమాలేదు. ఏమీలేదు. పడవండి.'

ఆ కంఠంలో అధికార దర్పానికి రంగనాయకులు తృప్తిపడ్డాడు. 'థేంక్స్...' అని ఆమె ప్రక్కన అడుగువేసేడు.

'ఎందుకేమిటి ?'

'ఇంత రాత్రివేళ వెళ్ళి ఇంటిల్లిపాదికీ నిద్రా భంగం చెయ్యాలి...'

అతని సహృదయతను అర్థం చేసుకొన్న సుశీలకు కలరం నిండివచ్చింది.

'నే నిక్కడున్నానుగా.' అంటూ సుశీల తండ్రి ఇంటి గుమ్మం ఎక్కింది. గుమ్మప్రక్కనీడలో రంగనాయకులు ఆమెను కౌగలించుకొన్నాడు. సుశీల ప్రతిస్పందన అతనిని ప్రోత్సహించింది. ముఖాన్ని ముద్దులతో నింపుతూ ఆ ఉద్వేగంతో కళ్ళ నీళ్ళు పెట్టుకొన్నాడు.

* * *

మీటింగులో జరిగిన విషయాలు వివరించడానికి సుశీల నాలుగైదు మార్లు ప్రయత్నించింది. కాని రంగనాయకులు వినిపించుకోలేదు.

'వదిలెయ్యి. ఈ గొడవలే మన జీవితాన్ని పాడుచేశాయి. మరి బుద్ధి వచ్చింది. ఎవరి కష్టసుఖాలు వాళ్ళు చూసుకోగలరు...'

'సహించుకోలేక పోతున్నారని అర్థం అయింది కదా. ఇన్నేళ్ళు ఎంత బాధపడ్డా ఇళ్ళ స్థలాలు చూపమేరకి ఫలించ లేదు. ఊరి పెత్తందారు అడ్డం. వారి దయా ధర్మాలతో నడిచే మంత్రులూ, ఆఫీసర్లూ అడ్డం. అసలీనాడున్న వ్యవస్థలో బీదవాడి ఉనికే అసంభవం అయింది...'

'ఇప్పుడేమన్నా మారిపోయిందా ?' — అన్నాడు. రంగనాయకులు.

ఆతని ప్రశ్న అర్థం అయింది.

'వ్యవస్థ కాలముట్టుగా మారి. ప్రపంచమంతా చక్కబడే వరకూ ఏదో ఒక చోటనో, ఏ కొంచమో సమకూడిన లాభాన్ని వుపయోగించుకో కూడదంటారా?'

'నేనేమీ అనలేదు. ఇళ్ళస్థలాలు పుచ్చుకోడం నిర్బంధం కాదు. తమకు అనవసరం అనుకొని కొంతమంది పుచ్చుకోలేదు. దానికి కష్టపెట్టుకోలేదు.

సుశీల కష్టపెట్టుకోలేదు. కాని, స్థలం అనవసరమయిన పల్లెలలో ఒక రాజకీయ పార్టీకి అనుచరులైనవారు దూరంగా వున్నారని ఆమె అనుకోలేదు.

కాని, తెల్లవారేసరికి వారు ఎందుకు సభలో చేరో రంలా గుప్పుమంది. మిగిలిన పార్టీలవారంతా ఆ అందెకరాల ప్రదేశంలో వెలిసే పేటలో వీధులు ఎంత వెడల్పుండాలి? పాఠశాలకి ఎంత స్థలం ఎక్కడ వదలాలి? కుటుంబానికి ఎంత భూమి కేటాయించాలి? అనే విషయాలమీద తర్జన భర్జనలు సాగిస్తూంటే మార్క్సిస్టు పార్టీ అనుయాయులు ఆ ఊరి పల్లెలోని వారే గాక, చుట్టుప్రక్కల గ్రామాల పల్లెల వాళ్ళుకూడా — వచ్చేసి ఆ భూమిలో తెల్లవారేసరి హద్దులు పెట్టేసు కొన్నారు. కొన్ని గుడిసెలు రాత్రికిరాత్రే తయారయాయి. మిగతా వాళ్ళు చీమలా అవి శ్రాంతంగా పని సాగించేస్తున్నారు. సర్వసేనాధిపతిలాగ సుందరరావు ఆ కార్యక్రమమంతమూ దగ్గరుండి నడిపిస్తున్నాడు.

(ఇంకా ఉంది)

# 50 పైసలు లాభం పొందండి!

ఆకర్షణీయమైన.
~~60~~ పైసల
విలువగల వంటింటిలో
అనేక విధాల ఉపయోగపడు
డబ్బా మీకు 10 పైసలకు
మాత్రమే లభిస్తుంది







నేడే బోర్న్‌విటా టిన్ కొనండి
దానిలో వంటింటిలో ఉపయోగపడు
అందమైన డబ్బా పొందండి. అది
పాలియస్టిరీన్‌చే తయారు చేయబడింది.
ఇందులో మీరు పంచదార, ఉప్పు, మసాలా
మరి తదితర ఆహార పదార్థాలను ఎంతో
వీలుగా పోసికొనవచ్చును.

**ఈ సదుపాయం సరకు ఉన్నంత వరకు మాత్రమే లభిస్తుంది.**

ప్రతి డబ్బాలో ఇదివరకు ఉన్నంత బోర్న్‌విటా
(450 గ్రా. నికరం) ఉంటుంది.

ఎకానమీ టిన్ కొనువారికి గూడ
ఈ ప్రత్యేక సదుపాయం గలదు.

**శక్తి, ఉత్సాహం మరియు రుచి కోసం క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా!**

SENSONS-6998 TF

# పాపః

ఆదివిష్ణు



పూజ గదినుంచి బయటకొచ్చిన కృష్ణమూర్తి — నుదుట విభూతి రేఖల్తో, వంటిమీద పట్టువస్త్రాలతో ధగధగా మెరిసిపోతున్నాడు. గదినుంచి బయటకు రాగానే అతను మొట్టమొదట — తన కొత్త [illegible]కట్టరీ వెంకుబాబుని ఆ హాల్లో చూసేడు. [illegible] వెంకుబాబు చేతిలో ఫైలుంది. అతను కూర్చున్న సోఫామీదినుంచి లేచి వినయంగా [illegible]డు.

పూజ [illegible] లేవంగానే ఈ వెంకుబాబుని [illegible] వచ్చినందుకు మనసులో బాధపడ్డాడు కృష్ణమూర్తి. కానీ, ఆ బాధని వ్యక్తం కానీకుండా, తల వంకిస్తో, దైవనామస్మరణ చేసుకుంటూనే తన గదిలోకి వెళ్ళిపోయేడు.

[illegible] గది గోడమీద కృష్ణమూర్తి శ్రీ॥ శ్రీ॥ [illegible]దుల ఫోటోలున్నాయి. కృష్ణమూర్తి ఆ ఫోటోల ఎదట నిలబడి [illegible]గా తల వంచేడు. చేతులు రెండూ [illegible]డు. కళ్ళు మూసుకున్నాడు. ఆ [illegible] కళ్ళల్లో తలిదండ్రులు [illegible]నుపించేరు. [illegible] భంగిమలో నిలబడేంతవరకూ అతను అలాగే వున్నాడు.

మూడు నిమిషాలకుగాని అతనికోరిక తీరింది కాదు. తృప్తిగా కళ్ళు విప్పి, మళ్ళా ఆ ఫోటోలకు చేతులు జోడించి, ఆతర్వాత భార్యా పిల్లల దగ్గిరికి వెళ్ళేడు.

అన్నపూర్ణ చేతిలో హారతి పళ్ళెముంది. ఆవిడ పూర్ణగర్భిణి కావటాన నిండుగా వుండి, అందంగానూ వుంది. ఆవిడ కట్టుకున్న ఖరీదైన జరీఅంచు పట్టుచీర, దానికి సరితూగే రవికతో ఎంతో హుందాగానూ వుంది.

హారతి కళ్ళకద్దుకున్నాడు కృష్ణమూర్తి. ఆతని నుదుట కుంకుమను దిద్దింది అన్నపూర్ణ. ఆపైన పళ్ళెంలో వుంచిన ప్రసాదాన్ని కృష్ణమూర్తి చేతుల్లో వుంచింది. కళ్ళకద్దుకుని ప్రసాదం పుచ్చుకున్నాడు కృష్ణమూర్తి.

పెదబాబూ, చినబాబూ, బుజ్జీ తలో స్వీటూ తండ్రికి అందించేరు. వాళ్ళ ముగ్గుర్నీ ఆప్యాయంగా దగ్గిరికి తీసుకుని, వాళ్ళందించిన స్వీట్లు తిన్నాడతను. ఆపైన ఆ ముగ్గుర్నీ సమరి [illegible]. చివరివంతుగా భార్యవేపు తిరిగి కళ్ళతో తనకోరికను తెలిజేసేడు. అన్నపూర్ణ కళ్ళు ఆనందంతో మెరిసేయి. భర్త కోరికను గమనించి, సిగ్గుపడి, అక్కణ్ణుంచి గబుక్కున వెళ్ళిపోయింది.

కృష్ణమూర్తి దుస్తులు మార్చుకున్నాడు. బుజ్జీని ఎత్తుకుని హాల్లోకి వచ్చేడు. హాల్లో వెంకుబాబు [illegible]ంకా నిలబడే వున్నాడు. కొడుకునెత్తుకుని వస్తూన్న కృష్ణమూర్తిని ఆనందంగా చూస్తో, తృప్తిగా అన్నాడు వెంకుబాబు:

'మెనీహాపీ రిటర్న్స్ ఆఫ్ ది డే సర్!'

'థేంక్యూ. కూచోండి!' అన్నాడు కృష్ణమూర్తి కూచుంటూ.

వెంకుబాబు కృష్ణమూర్తి ఎదట సోఫాలో వొద్దికగా కూచున్నాడు. కృష్ణమూర్తి సంతకాలు చేయవలసిన చెక్కుల్ని ఫైల్లోంచి తీసి టీపాయ్‌మీద వుంచేడు.

బుజ్జీని గుండెలకు హత్తుకుంటో అన్నాడు కృష్ణమూర్తి...

'వారం రోజుల్నుంచీ రెస్ట్ లేకుండ



తిరుగుతున్నాను. టూ మెనీ ఫ్లైట్స్! ఇవేళ బొంబాయిలో వుండాల్సింది. ముఖర్జీ ఎంత ప్రాధేయపడుతున్నా అతన్ని కాదని వొప్పించి వచ్చేసేను. ఎందుకో తెలుసాండీ! —నా భార్యాపిల్లల మధ్య చేసుకోబోయే ఈ పుట్టినరోజు పండగ— బొంబాయిలో నా 'స్టే' కంటె చాలా ముఖ్యమని నా ఉద్దేశం. అదే ముఖర్జీతో కూడా అన్నాను. సెంటిమెంట్సంటాను ముఖర్జీ! (కృష్ణమూర్తి చిరునవ్వు నవ్వేడు బుజ్జిని ప్రేమగా ముద్దు పెట్టుకున్నాడు. రెండేళ్ళ బుజ్జి తండ్రిని తిరిగి ముద్దు పెట్టుకున్నాడు.) సీ దిస్ స్వీట్ కిస్! హౌ కాస్ట్లీ ఇటీజ్! ఇవేం తెలీవు ముఖర్జీకి. చెప్పినా అర్థం చేసుకోలేడు పూర్ ఫెలో! సో, మిస్టర్ బాబూ! ఇవాళంతా నేను నా పిల్లల్తో ఆడుకుంటాను. చెక్కులు తీసుకుని ఆఫీసుకి వెళ్ళిపొండి సాయంత్రం అయిదు ప్రాంతాల్లో ఆఫీసుకొస్తాను. ఐ విల్ సైన్ దెమ్ దేర్!'

తాను చెప్పదలుచుకున్నదేదో స్పష్టంగా చెప్పి, తిరిగి బుజ్జితో ఆడుకుంటున్నాడు కృష్ణమూర్తి. వెంకుబాబు ఫైలు సర్దుకుని లేచి నించున్నాడు. వస్తానని చెప్పేందుకు నోరు తెరువబోయేడు. కానీ, కృష్ణమూర్తి బుజ్జి ఆటల్లోపడి సర్వస్వాన్నీ మరిచిపోతున్నాడు. కృష్ణమూర్తి ఒళ్ళో కూచున్న బుజ్జి, కృష్ణమూర్తి మెళ్ళో మెరుస్తున్న బంగారు గొలుసునీ, దానికున్న వేణుగోపాల కృష్ణుని బొమ్మనీ చేత్తో తాకుతూ ఆడుకుంటున్నాడు. వాడి ఆటల్ని చాలా శ్రద్ధగా గమనిస్తున్నాడు కృష్ణమూర్తి.

వెంకుబాబు పరవశుడయ్యేడు. దేవుని పట్లా, దేవాలయంలాటి ఇంటిపట్లా, భార్యా పిల్లలపట్లా, కృష్ణమూర్తికిగల శ్రద్ధాసక్తులకు వెంకుబాబు పూర్తిగా పరవశుడయ్యేడు తాను కూడా వెంటనే పెళ్ళాడి, పిల్లల్ని కనేసి, వాళ్ళ నెత్తుకుని, తీరుబడిగా వాళ్ళతో ఆడుకుంటూ కాలక్షేపం చేయాలని ఆ క్షణంలో వెంకుబాబుకి కోరిక కలిగింది ఆ కోరికనుంచి, ఆ కలల నుంచీ అతను దూరం కాకమునుపే కృష్ణమూర్తి గొంతు వినిపించింది—

'నాతో యింకా ఏదైనా పనుందా బాబూ?'

వెంకుబాబు తొట్రుపడ్డాడు. తన కోరికకీ, కలలకీ సిగ్గుపడ్డాడు. ఏం లేదని; వెళ్ళొస్తానని పొడి పొడిగా అనేసి అక్కడ్నుంచి నెమ్మదిగా కదిలి బయటపడ్డాడు.

వెంకుబాబు వెళ్ళిపోయిన తర్వాత కృష్ణమూర్తి వంట గదిలోకి తొంగి చూస్తూ భార్యని హెచ్చరించేడు—

'అన్నపూర్ణా! ఇంకా గుడి కెళ్ళవలసివుంది. కాఫీ ఏర్పాట్లు చూసి తొరగా తెములు. వేళవుతోంది!'

'ఇదిగో క్షణం!' అన్నదామె వంట గదిలోంచి.

* *

వేణుగోపాలస్వామివారి ఆలయం దగ్గిర కారు ఆగింది. బుజ్జిని ఎత్తుకుని ముందుగా కృష్ణమూర్తి దిగేడు. పెదబాబూ, చినబాబూ కారునుంచి దూకుతున్నప్పుడు —ఆదుర్దాగా వాళ్ళని మందలించేడు కృష్ణమూర్తి.

'నెమ్మదిగా దిగండ్రా ఫూల్స్!'

అన్నపూర్ణ దిగేందుకు ఇబ్బంది పడుతోంది. ఆమె ఇబ్బంది పడుతూంటే కృష్ణమూర్తి మనస్సు చివుక్కుమంది. మరుక్షణమే, అతన్లో ఆనందంతో కూడిన గర్వం ఉప్పొంగి పొర్లింది. బుజ్జిని డ్రైవరికిచ్చి, అన్నపూర్ణ దిగేందుకు కృష్ణమూర్తి సాయపడ్డాడు.

ఆమె కారు దిగుతున్నప్పుడు మనసారా వేణుగోపాలస్వామిని తలుచుకున్నాడు—

'ముగ్గురూ మగబిడ్డలే యిచ్చేవు. ఈ తడవకైనా చక్కటి ఆడపిల్లనిచ్చి మా ముచ్చట తీర్చే భారం నీదే స్వామీ!'

—సతీ సుత సమేతంగా ఆలయం ప్రవేశించిన కృష్ణమూర్తిని అల్లంత దూరాన్నుంచే చూసిన పూజారులు ఎదురొచ్చి సాదరంగా ఆహ్వానించేరు. పేరు పేరునా వాళ్ళ క్షేమ సమాచారములు కనుక్కున్నాడు కృష్ణమూర్తి. అతని తండ్రిగారే ఈ ఆలయాన్ని కట్టించేరు. ఆ మాటకొస్తే, గుళ్ళూ గోపురాలూ, ధర్మసత్రాలూ వారెన్నో కట్టించి పుణ్యం దక్కించుకోవడమే గాకుండా—ప్రాపంచికంలో మంచి పేరు ప్రతిష్ఠలు కూడా సంపాయించుకున్నారు.

తండ్రికి తగ్గ కొడుకు ఈ కృష్ణమూర్తి. తండ్రి ఆర్జించిన ఆస్తినీ, పేరు ప్రతిష్ఠలకూ ఏ విధమైన భంగమూ కలుగకుండా జాగ్రత్తలు తీసుకుంటున్నాడు. లయన్స్ క్లబ్‌లో సింహమై, పురప్రముఖుల్లో ముఖ్యుడై తనకు తోచిన దాన ధర్మాలు తానూ చేస్తూనే వున్నాడు.

దేవుని ఎదట భార్యా పిల్లల్తో వినమ్రంగా నిలబడి వున్నాడు కృష్ణమూర్తి. పూజారులు మంత్రోచ్చారణ చేస్తున్నప్పుడు పైన గంట మోగించి చేతులు జోడించేడు. కళ్ళు మూసుకుని వేణుగోపాలస్వామిని మనసారా స్మరించేడు. మంత్రోచ్చారణతో పాటు తన చెవికింపుగా ఎక్కడ్నుంచో కమ్మగా వేణునాదం వినిపిస్తోంది. అతని శరీరం యావత్తూ పరవశంతో జలదరించింది. సాక్షాత్తూ ఆ వేణుగోపాలుడు తన ఎదట అలవోకగా నవ్వుతూ ప్రత్యక్షమయ్యేడు. ఆ పరమాత్ముని చేతుల్లో అపరంజిబొమ్మలాటి పసిపాప బోసినవ్వుల్ని కురిపిస్తోంది. కృష్ణమూర్తిని ఆకర్షించింది. చేతులు జాచేడు కృష్ణమూర్తి. పరమాత్మ ఆ పసిపాపని కృష్ణమూర్తి చేతుల్లో వుంచేడు.

మంత్రోచ్చారణ ముగిసింది. పైన గంట వినిపిస్తోంది. కళ్ళు విప్పి చూసేడు కృష్ణమూర్తి. పూజాద్రవ్యాలతో నిండిన హారతి పళ్ళెం తన కళ్ళముందున్నది. తృప్తిగా హారతిని కళ్ళకద్దుకున్నాడు కృష్ణమూర్తి.

'బాబుగారి దర్శనం ఈమధ్య బొత్తిగా కరువైపోయింది' అన్నాడు పూజారి.

కృష్ణమూర్తి చిరునవ్వునే జవాబుగా చెప్పి, బుజ్జి చేతిద్వారా [illegible] కాగితాన్ని పూజారి కిప్పించేడు. పూజారి ఆ చిన్న పచ్చకాగితాన్ని పుచ్చుకున్నాడు. భార్యా పిల్లల్తో కారువేపు కదిలేడు కృష్ణమూర్తి.

* * *

సాయంత్రం అయిదుగంటల ప్రాంతాల కృష్ణమూర్తి కారు అతని ఆఫీసు ఎదట ఆగింది కృష్ణమూర్తి కారుదిగి ఆఫీసు గదిలోకి నడిచేడు. ఆఫీసు గదిముందర బల్లమీద కూర్చున్న ప్యూన్ వెంకట్



నిశ్శబ్దంగా కాలి నడుస్తున్నాడు. గదిలోకి అడుగుపెడుతూ 'వెంకుబాబుగార్ని పిలు' అన్నాడు కృష్ణమూర్తి.

ఎయిర్ కండిషన్ గదిలో తనసీటుకి ఎదురుగా కూచుని శ్రద్ధగా పేపరు చదువుకుంటున్న మిత్రుడ్ని వెనకనుంచి చూసి పోల్చుకున్నాడు. తన సీటు దగ్గిరికి వెడుతూ ఆశ్చర్యంగా అన్నాడు—

'ఎప్పుడొచ్చేవురా శేషు! వచ్చేవాడివి తిన్నగా యింటికే రాకపోయేవా?'

శేషు వెంటనే జవాబు చెప్పలేదు. కృష్ణమూర్తి కూచున్న తర్వాత, ఇద్దరూ సిగరెట్లు ముట్టించుకున్నారు. అగ్గిపుల్లని ఆర్పేస్తూ అన్నాడు శేషు—

'బెంగుళూరునుంచి ఉదయమే వచ్చేన్రా! మధ్యాహ్నమంతా నిద్రతోనే సరిపోయింది. నిద్రలేచి ఆఫీసుకి ఫోన్ చేసేను. నువ్విక్కడికి వచ్చే వేళయిందని నీ సెక్రటరీ చెప్పేడు. నువ్విక్కడికి రావడానికి సరిగ్గా పది నిమిషాల క్రితం నే నిక్కడికి వచ్చేను.

## పా లు

అన్నట్టు, ఇవాళ నీపుట్టినరోజుకదా—'

'అవును ఇవాళ్టితో ముప్ఫైఅయిదు పూర్తయ్యేయి. ముసలాడ్ని అవుతున్నాను కదూ?'

'అప్పుడే?'

'మనిషి బతికే సగటుకాలంలో సగం దాటిపోయేను గదా!'

'ఇప్పుడు సగటులెక్కలు చెప్పి బోర్ కొట్టొద్దు. మంచి ప్రోగ్రాం ఏర్పాటు చెయ్. ఈ బర్త్‌డేని అందంగా సెలబ్రేట్ చేసుకుందాం. అన్నట్టు, మరిచేను. రాఘవ గాడిక్కూడా ఫోన్‌చేసి చెప్పు. లేకపోతే ఏడ్చిపోతాడు ఫూల్! ఏదీ...ఆ ఫోనిలా తగలెయ్...నేనే వాడిని పిలుస్తాను.' అంటూనే ఫోనందుకున్నాడు శేషు. డయల్ చేసేడు.

వెంకుబాబు ఫైల్‌తో లోపలికొచ్చేడు. అతని దగ్గిరున్న చెక్కుల్ని తీసుకుంటూ అన్నాడు కృష్ణమూర్తి—

'బాపూజీ అనాథాశ్రమానికి వెయ్యిన్నూట పదహార్లకి చెక్కు రాయండి. నాచారిటీ ఎకౌంట్‌నుంచి డ్రా చేయండి.'

వెంకుబాబు తలూపేడు. రాఘవతో ఫోన్‌లో మాట్లాడుతున్నాడు శేషు. రెండు చెక్కుల్ని సంతకం చేయడం పూర్తిచేసి హాయిగా నవ్వేస్తూ వెంకుబాబుతో మళ్ళీ అన్నాడు కృష్ణమూర్తి—

'నాబర్త్‌డే నాకంటె ఎక్కువగా జ్ఞాపకం వుంటుంది, బాపూజీ అనాథాశ్రమం సెక్రటరీకి. నే నెక్కడ మరిచిపోయేనో అని మధ్యాన్నం ఫోన్‌చేసి గుర్తుచేసేరాయన. ప్రతి బర్త్‌డేకి నాకు తోచింది వాళ్ళకి యివ్వడం నా కలవాటు. ఇవాళి పూర్తయిన తర్వాత వాళ్ళకో చెక్కురాసి పట్టుకురండి.'

'అలాగేనండి' అన్నాడు వెంకుబాబు.

ఫోన్‌లో రాఘవతో ఏం మాటాడుతున్నాడోగాని అవతల్నుంచి వినిపించే ప్రతి మాటకీ అలాగే, అలాగే అంటూ బదులు చెబుతున్నాడు శేషు. చివరికి [illegible] ఫోన్ కృష్ణమూర్తికిచ్చి వూరుకున్నాడు.

ఫోన్లో రాఘవని వింటూ, మందహాసంతో తలూపుతూ చెక్కులు సంతకం చేస్తున్నాడు. కృష్ణమూర్తి. అటు ఫోన్లో మాట్లాడుతూ, ఇటు చెక్కులపని రెండూ ఒకేసారి పూర్తయ్యేయి. చెక్కులు తీసుకుని వెంకుబాబు వెళ్ళబోతుండగా అతన్ని ఆపి అడిగేడు కృష్ణమూర్తి—

'అన్నట్టు—మీకివాళేమైనా అర్జంటు పనులున్నాయా బాబూ?'

'లేవండి' అన్నాడు వెంకుబాబు.

'దట్స్‌గుడ్! అయితే ఇవాళంతా మీరు నాకూడానే వుండిపోతారు. అనాథాశ్రమం చెక్కు పూర్తిచేసి తీసుకొస్తే సంతకం చేస్తాను. దాన్ని వెంకటస్వామికిచ్చి పంపించండి. ఆ తర్వాత మాతోపాటు వచ్చెయ్యండి. ఓ.కె?'

'అలాగేనండి!' అని ఆగది వొదిలేసి వచ్చేసేడు వెంకుబాబు

వెంకుబాబుకివాళంతా చాలా ఆనందంగా వుంది. అదృష్టవశాత్తూ తనకి కే. కే. అండ్ కంపెనీలో ఉద్యోగం దొరికిందని అతనివాళ చాలా తడవలనుకున్నాడు. కే. కే. ఇలా సరదాగా, హుందాగా వుండి నడుపుతున్నాడంటే కారణం

## దీపావళి నాడు

క. కళకళ లాడెదు దమ ముం
గిళులను నందాల ముగ్గు లిచిరి ముదితల్
తళతళ కాచెడి లేయెం
డం వచ్చని బంగరు వన్నెలు మెర
యంగన్.

క. వెలవెల మను నార్భాటం
బులవిన్న క్రొత్త యల్లుడు వులికి
పడంగా,
గలగల మని నవ్వెను మర
దలు, యల్లుని వదనమపుడు వెలవెల
బోయెన్.

క. ఎరుగక జొక్కితి నిట నె
త్తెరుగన తప్పించుకొందు దేవుడ!
యని త
త్తర నాటు సెందు బావను
మరదలు పొవ్వాకు తాన ముదిపెము
సేసెన్.

క. వరిహాసమ్ములతో, మది
చిదునగవులతోను, దృష్టి చిందాలు
వేమక్
కరిగెను సగలంతయును, దిన
కరుడంతట బశ్చిమంపు గిరులను
డాగెన్.

క. చిరు దీపమ్ముల వరుసలు
దెరువంతయు నింపె దివ్య దీధితు
లను యే
మెరుగని పసిపాపని వలె
వెరగని యా మోమందలి చిరునవ్వు
వలెన్.

క. ఏ తగువేమియు నెరుగక
కూతురు కోడళ్ళు నింట కూరిమి
తోడన్
నాతురముగ నన్ని పనుల
జేతురు తమ పెద్దవాండ్ర చిత్తము
లొప్పన్.

క. అరమను నాడుచు పాడుచు
అరగని దమ బోసినవ్వు తరకల తోడన్
జెరగుదురు దివ్యకాంతుల
చిరుబుడతలు యింటనెల్ల చిందుల
తోడన్.

నవ్వులు నిండిన గృహముల
నెవ్వారును జింతలేమి యెరుగని
యెడలన్
దివ్వెలతోనే బని లే
దివ్వానికి నిత్యమైన దీపావళియే!

—ఆర్. వి. చలపతి

అతనికున్న సిరిసంపద లెక్కచేకాదు. సిరిసంపదలు పుష్కలంగా వున్న ఎంతమంది ధనికులు జే. కె లాగా వుండగలుగుతున్నారు! వింతగా హాయిగా వున్నారు? మనిషికి అరుదైన దైవత్వం ఈ జే. కె లోవుంది. అందువాతనే ఆతనంత నిర్మలంగా వుండ గలుగుతున్నాడు—అని కూడా వెంకుబాబు అనుకున్నాడు

బాపూజీ అనాధాశ్రమం - ప్రకటిత పేరున అందంగా రాసేదు చెక్కులి. వెయ్యిన్నూట పదహార్లు రాస్తున్నప్పుడు వెంకుబాబు మనసారా అభినందించేడు.

# పాలు

వెంకుబాబుకి కూడా 'నా' అన్నవాళ్ళు లేరు. ఆశ్రమంలోనే పెరిగి పెద్దవాడయ్యేడు. దేశంలో దానధర్మాల ఉనికివల్ల అతను చదువుకుని యోగ్యుడయ్యేడు. ఈ జే. కె లాంటి దానకర్ణులూ, బాపూజీ అనాథాశ్రమం లాంటి ఆశ్రయాలూ లేకపోతే తన గతేమయ్యేది?

'వెయ్యేళ్ళు వర్ధిల్లండి బాస్! మీ సిరి సంపదలు, మీ భార్యా పిల్లల్తో పాటు చిరకాలం సుఖంగా వుండి—అభాగ్యులకూ, నిరుపేదలకూ సాయపడండి' అనుకున్నాడతను.

చెక్కు రాయడం పూర్తయిం తర్వాత, జే. కే గదిలోకి వెళ్ళేడు వెంకుబాబు—చెక్కుతోసహా అప్పటికే ఆ గదిలోకి రాఘవ వచ్చి కూచున్నాడు. ఛలోక్తులు విసురుతూ మిత్రులిద్దర్తోనూ ఆనందంగా వున్నాడు కృష్ణమూర్తి. వెంకుబాబు రావడంచూచి మాటలాపేసేడు. అతను తెచ్చిన చెక్కుమీద సంతకంచేసి, చెక్కుని వెంకుబాబుకిస్తూ అన్నాడు--

'మా ఫ్రెండ్సిద్దరూ రెడీగా వున్నారు. మీదే ఆలస్యం. ప్లీజ్...తొరగా తెములిరండి.'

* * *

ఊరికి దూరంగా సముద్రముంది. ఆ బీచ్‌లో అత్యాధునిక వసతులుగల చక్కటి రహదారి బంగళా వుంది. ఆ బంగళాను చేరుకున్నాడు కృష్ణమూర్తి — మిత్రులిద్దరూ, వెంకుబాబులతో.

రహదారి బంగళాలో ఆ రాత్రి కృష్ణమూర్తి బర్త్‌డే చాలా సరదాగా సెలిబ్రేట్ చేసుకోడం ప్రారంభించేరు.

విదేశీ విస్కీ సీసాలు అరున్నాయి. స్వదేశీ దినుసులు వాటికి జత చేసేరు. ఒక సీసాను స్వహస్తాలతో ఊడదీసేడు కృష్ణమూర్తి. మిత్రులిద్దరి గ్లాసుల్లోనూ పోసి, తన గ్లాసులోనూ పోసుకుని, వెంకుబాబు గ్లాసులో పోయబోతుండగా — వెంకుబాబు చెయ్యడ్డంపెట్టి 'అలవాటు లేదు క్షమించండి' అన్నాడు.

వెంకుబాబు తాగనందుకు రాఘవ్ విసుక్కున్నాడు. కానీ, గ్లాసెత్తి ఒక గుటక గొంతులో పోసుకోడంతోటే—తాగడం అలవాటులేని వెంకుబాబుని చాలా మెచ్చుకున్నాడు. కనీసం, దగ్గిరుండి తమ గ్లాసులైనా నింపే కార్యక్రమం ప్రారంభించమని కోరేడు.

కృష్ణమూర్తి కూడా అదే అన్నాడు!

నిలువెల్లా కంపించిపోయేడు వెంకుబాబు. ఇంత మంచి మనిషికి ఈ క్షుద్రమైన అలవాటు ఎందుకు అంటుకుందోనని అతను బాధపడ్డాడు.

మత్తులో వున్న మనిషి సంస్కారానికి దూరమవుతాడని అతని భయం! కృష్ణమూర్తికి సెక్రటరీగా వున్నందుకు అతను సిగ్గు పడటంలేదు గానీ, విస్కీని ఆ మూడు గ్లాసుల్లో తన చేత్తో పోసేటందుకు మాత్రం అతను అల్లాడిపోతున్నాడు. అయితే, అతన్నెవరూ పట్టించుకునే స్థితిలో లేరు.

—మూడు సీసాలు పూర్తయిం తర్వాత వాళ్ళకి మరొక తాజా కొత్త కోరిక కలిగింది. శేషు బయటపడిపోయేడు. కృష్ణమూర్తిని అడిగేడు—

'అన్నట్టోరేయ్! గంగాభవాని యిప్పుడిక్కడ మన మధ్య వుండివుంటె ఎలా వుంటాదంటావ్?'

'మజాగావుండి, మజా మజాగా వుంటుందుంటుంది' సమాధానం చెప్పింది మాత్రం రాఘవ,

కానీ, అదిక్కడ లేదు. బొంబాయిలో ముఖర్జీ దగ్గిర కెళ్ళిపోయింది. ప్రస్తుతం దాన్ని వాడు వాడుకుంటున్నాడు.' అన్నాడు కృష్ణమూర్తి.

వెంకుబాబుకి కృష్ణమూర్తి మాటలు కటువుగా, రోతగా వినిపించేయి. మనిషి పడిపోవడం ప్రారంభిస్తే—అతనెంతవరకూ పడిపోతాడో వూహించడం కష్టమని గూడా తోచింది. ఆ పడిపోవడం కళ్ళారా చూచేదానికంటె (కృష్ణమూర్తి అనుమతిస్తే) ఆ గదినుంచి పారిపోవాలనుకుంటున్నాడు.

'అంత వుపకారం చేసేవ్ గదా, అది విన్నెట్లా మరిచిపోయింది?' శేషు అడిగేడు.

'నన్ను మరిచిపోయిందని ఎవడన్నాడోయ్? ముఖర్జీ ప్రస్తుతం దాన్ని వుంచుకున్నాడని అన్నానంతే!' అన్నాడు కృష్ణమూర్తి.

'ఎన్నాళ్ళైనా నీది మా చెడ్డ లీగల్ బుర్రరా కిష్టుడూ! మరి...నీ రెండో ఖానాసుల అడ్రస్సేమిటి? ఈ వూళ్ళోనే వుందా? లేకపోతే మరో చెటర్జీగాడు ఎగరేసుకుపోయేడా?'

రాఘవ నిగ్గదీసి అడిగినప్పుడు కృష్ణమూర్తి సమాధానం ఏం చెబుతాడోనని శేషు కుతూహలంగా వున్నప్పుడు కృష్ణమూర్తి నీళ్ళు నమిలేసేడు.

కాసేపు నిశ్శబ్దానంతరం 'ఆత్మహత్య చేసుకుంది. కారణాలు అడగొద్దు' అన్నాడు.

వెంకుబాబుకి భయం (మళ్ళా)వేసింది. కృష్ణమూర్తి తాలూకు కుటుంబం గుర్తుకొచ్చింది. అన్నపూర్ణలాటి అన్నపూర్ణమ్మ, ముత్యాల్లాటి ఆవిడ ముగ్గురు బిడ్డలూ జ్ఞాపకంరాగా అతను వణికిపోయేడు.

'మిజరబుల్...టూ మిజరబుల్ ఇటీజ్! అయితే ఇప్పుడిక్కడికొచ్చే ఆడగాలే వూళ్ళో లేదా ఏంట్రా?' అడిగేడు శేషు.

'ఎందుకు లేదు! ఈ వూళ్ళోనే వుంది. ఎంతో అందమైంది. అణకువగా వుండి చెప్పేది శ్రద్ధగా వింటుంది...నీలవేణి!' అన్నాడు కృష్ణమూర్తి.

'దణ్ణం పెడతానొరేయ్ ... బావ్బాబు దాన్నిక్కడికి పిలిపించు వెంటనే...' ప్రాధేయపడ్డాడు రాఘవ.

'డేం నీలవేణి! ఇటీజ్ బోర్!...అది బాలింతరాలురా!' బాధగా అన్నాడు శేషు.

'ఎప్పుడు? ఎనిమిది నెల్లక్రితం! ఇప్పుడా టెక్నికల్ దోషాలేమీ వుండవు' కృష్ణమూర్తి నచ్చుదాయించేడు.

గ్లాసుల్లో విస్కీని పోస్తూ వున్నాడు వెంకుబాబు. కృష్ణమూర్తి ఇప్పుడతనికి దేవుళ్ళాగా కనుపించడంలేదు. మనిషిలాగానూ కాకుండా పచ్చి నెత్తురు తాగే రాక్షసపీనుగులా కనుపిస్తున్నాడు. మళ్ళా కృష్ణమూర్తి కుటుంబ సభ్యులు గుర్తుకు రాగా వెంకుబాబు కళ్ళల్లో నీళ్ళు తిరిగేయి.

'ఆలస్యం తగదొరేయ్...వెంటనే తొరగా పిలిపించు...మందైపోతోంది ఆనక ఇబ్బంది పడిపోవాలి...తొరగా పిలిపించు.' అన్నాడు రాఘవ

కృష్ణమూర్తి వెంకుబాబుని చూసేడు.

'మిస్టర్ బాబూ! ... నీకు నీలూ తెలుసా? మిస్ నీలవేణి...తెలుసా?'

'నాకు తెలీదుసార్!'

'డేం నాన్సెన్స్...ఏతనేం సెక్రటరీ! సెండ్ హిమవుట్!' శేషు కేకలుపెట్టేడు.

వెంకు బాబుకి కోపం వచ్చింది. కానీ, దాచేసుకున్నాడు. ఇంత విశాలమైన ప్రపంచంలో ఒకానొక వేశ్య, నీలవేణి తెలీకపోతే సెక్రటరీ పదవికే భంగమా?

కానీ ఈ మధ్య కొత్తగా తిరుగుతున్నవాళ్ళకు ఇలాంటి అంశాలే వినిపిస్తాయని వెంకుబాబు అనుకుని కోపాన్ని దిగమింగుకున్నాడు.

'నీకు తెలీకపోతే ... నా డ్రైవర్ కి తెలుసు...గో విత్ ది కార్! హి విల్ టేక్యూటు నీలవేణి! నేను రమ్మన్నానని చెప్పు... వో త్వరగా వస్తుంది...అసలు, నా కారుని చూస్తేనే చాలు...ఎగిరి గంతేసి కూచుంటుంది ...గో వెన్! గో...' కృష్ణమూర్తి మధ్య మధ్య మధ్య కళ్ళు మూసుకుంటూ తాను చెప్పదలుచుకున్నదంతా చెప్పేసేడు.

పుట్టెడు దిగులుతో వెంకుబాబు రహదారి బంగళాను వదిలేడు. రేపు ఉద్యోగమే వదిలేసేయాలని నిశ్చయించుకున్నాడు.

* * *

నీలవేణి ముగ్గురు మిత్రుల మధ్య చాలా విలాసంగా కూచుని వుంది. ఆమె



ముందు ఒక గ్లాసు వుంచేడు కృష్ణమూర్తి. వెంకుబాబువేపు చూసేడు.

వణుకుతున్న చేతులతో ఆ గ్లాసులో కూడా విస్కీని పోసేడు వెంకుబాబు. నీలవేణి వెకిలిగా నవ్వింది. నవ్వు ఆగగానే ముగ్గురి మిత్రులకి జెక్కొట్టింది. ఒకే ఒక్క గుటకలో సగం గ్లాసుని పూర్తి చేసి గొంతు తడుపుకుంది.

వెంకుబాబు నిశ్చేష్టుడయేడు. దేవుడు ఈ స్త్రీకి ఇంత అందాన్ని, సొగసుని ప్రసాదించి — దురలవాటుని కూడా ఎందుకు జతచేసేడని వాపోయేడు.

మిత్రులు ముగ్గురూ నీలవేణి చొరవకి హర్షం వెలిబుచ్చేరు ఆడదంటె అంత దమ్ములో వుండాలన్నారు. స్వచ్ఛమైన ఆడది నీలవేణి ఒకర్తేనని అన్నారు. ఆడది నీలవేణిలాగా వుండకపోతే మగడనేకమైన ఈతిబాధల్లో ఇరుక్కుంటాడని అన్నారు. ఇంకా ఆ బాపతు పలుకులే చాలా చాలా అన్నారు.

వెంకుబాబుకి అప్పుడు అన్నపూర్ణమ్మ గుర్తుకు వచ్చింది. అందువల్ల, ఇక్కడి గుంపుమీద రోత కలిగింది.

'నాకు మందక్కర్లేదు ఫ్రెండ్! నీలు కావాలి ... నా ప్రియమైన నీలూ కావాలి నా నీలుని నాకిచ్చేయండి' మత్తుగా అంటున్నాడు రాఘవ.

'ఆగాగే' అన్నాడు శేషు.

'నో!...ముందు నాకు కావాలి ..అత్యాశనే మీకు...ఏది రైటో కావలిసే, నా నీలునే అడగండి' అంటున్నాడు కృష్ణమూర్తి.

రాఘవ నీలని అడిగేందుకు సిద్ధమయ్యేడు

అంతలో..

ఎక్కడ్నుంచో ఏడుపు వినిపించింది. పసిపిల్ల ఏడుస్తోంది. డ్రైవరు పెద్ద గొంతుతో సముదాయిస్తున్నాడు. అయినా, ఏడుపు ఆగడం లేదు. గుక్క తిప్పుకోకుండా ఏడుస్తోంది. కృష్ణమూర్తికి చిరాకనిపించింది. నీలవేణివేపు కోపంగా చూస్తూ అడిగేడు —

'ఎవరది ఏడ్చేది ?'

నీలవేణి ఖంగారుగా లేచి నించుంది. రాఘవ ఆమె చేతిని గుంజి కూచోపెట్టేడు. నీలవేణి అన్నది...

'నా పిల్ల!'

'నీ పిల్లా? ఎందుకు తెచ్చేవ్ ?...నిన్ను రమ్మని ఖబురంపేనే గానీ...నీ పిల్లా జెల్లాని తీసుకు రమ్మనలేదే ?' అన్నాడు కృష్ణమూర్తి.

నీలవేణి బిక్కు బిక్కుగా సమాధానమిచ్చింది—

'మీకు చూపిద్దామని తీసుకొచ్చేను.

'ఇప్పుడెందుకా ముచ్చట ? కోపంగా అరిచేడు కృష్ణమూర్తి.

'అది మన పిల్లండీ!' అన్నదామె.

ఆ మాటకి మిత్రులిద్దరూ పకపకా నవ్వేసేరు.

'షటప్! స్టాప్ ది నాన్సెన్స్!' కృష్ణమూర్తి గట్టిగా అరిచేడు.

నవ్వు ఆగిపోయేరు.

'ఎవరైనా నవ్వేరా మీ ప్రాణాలు తీస్తాను, నీలూ! నువ్వేం మాట్లాడుతున్నావో

ఒరేయ్ రవీ టపాకాయ్
ఓ మాటివ్వారా పెళ్ళిచ్చేస్తా



వళ్ళు తెలిసే మాటాడుతున్నావా? డొక్క చీరేస్తాను జాగ్రత్త! మన పిల్లట - మన పిల్ల! కావలిస్తే డబ్బడుగు. నా దగ్గిరది చాలా వుంది. దానం చేస్తాను. నా యిష్టమొచ్చినంత దానం చేస్తాను. డబ్బుకి కక్కుర్తిపడే ముండవి...మన పిల్లట—మన పిల్ల! బజారుపిల్లని నా పిల్లన్నావంటె పీక తెగ్గోస్తా! బి కేర్‌ఫుల్!...బాబూ, నువ్వెళ్ళి ఆ పిల్ల నోరు నొక్కేయ్...' అన్నాడు కృష్ణమూర్తి.

నీలవేణి గభాలున లేచి నించున్నది.

'వద్దు వద్దు. పసిపిల్ల నోరు నొక్కి పెట్టకు. మాట కట్టుకోవద్దు. అది పాల కోసం ఏడుస్తోంది. నన్నెళ్ళనీండి. దానికి పాలిచ్చి వస్తాను.' అంటోంది నీలవేణి.

రాఘవా, శేషూ కలిసి ఆమెను కూచో పెట్టేసేరు!

'నో... నో...నువ్వెళ్ళిపోతే మేం చచ్చిపోతాం. ఇదికూడా పాపమే...బాబూ.. పాలు తాగిస్తాడు. బాబూ, బయటకెళ్ళి పిల్లకి పాలివ్వు గో...' అన్నాడు రాఘవ.

'పిల్లను తెచ్చింది చాలక దాన్ని ఏడిపించి, పాలిచ్చి ముచ్చట తీర్చుకుంటావా? రూబ్బిష్ బిచ్! ఐ విల్ పనిష్ యూ!' బాబూ, ఆ ఖాళీసీసా అందుకో' అన్నాడు కృష్ణమూర్తి.

బాబు సీసా తీసుకోలేదు.

'బాబూ!' అరిచేడతను.

బయట పసిపిల్ల ఏడుస్తూనే వుంది. వెంకుబాబుకి కృష్ణమూర్తి పిల్లలు ముగ్గురూ గుర్తొచ్చేరు. ముఖ్యంగా, ఆ అందమైన బుజ్జి అతని మనసంతా నిండిపోతున్నాడు. అతనికి ఏడుపు ముంచుకొస్తోంది. ఏం చేయడానికి తోచ లేదు. కృష్ణమూర్తి ఆజ్ఞ ప్రకారం ఖాళీ సీసాని తెచ్చి కృష్ణమూర్తి ముందుంచేడు.

ఆ సీసాలో కృష్ణమూర్తి విస్కీ పోసేడు. ఆ విస్కీ పోసిన సీసాని వెంకుబాబుకిస్తూ అన్నాడు—

ఇదే పాలు! అండర్‌స్టాండ్...వెళ్ళు... వెళ్ళి ఈ పాలు దానిచేత తాగించి ఏడుపాపించు వెళ్ళు.

వెంకుబాబు సీసాని తీసుకున్నాడు—

'నిజమే సార్! తెల్లనివన్నీ పాలు నల్లనివన్నీ నీళ్ళు కావు...ఇవి పాలే!...ఈ విస్కీ పాలని దానం చేస్తున్న మీరు మాత్రం దాన కర్ణులు. పరమభక్త శిఖామణులు. ఉదర్శ గృహస్థులు. ఆ పిల్ల చాత ఈ విస్కీని తాగించేదానికంటె, నను దంలో ఆపిల నుంచేయడమే మేలు...మత్తులోవుండి మీరు నాచేత చేయించబోయే దుర్మార్గాన్ని సహించలేను. ఈ రాత్రంతా ఆ బిడ్డ నాదగ్గిరే వుంటుంది. నగరంలో ఈ రాత్రంతా పాలకోసం తిరుగుతాను. పాలు సంపాయించి, ఆ బిడ్డకిచ్చి తృప్తిపడతాను. ఈలోగా నీలవేణితో మీరు పాపం చేసుకోండి. వస్తాను' అనుకుంటూ వెంకుబాబు విస్కీ సీసాతో కదిలేడు.

నీలవేణి తన బిడ్డకోసం పెనుగులాడుతోంది. రాఘవ, శేషు ఆమె నక్కణ్ణుంచి కదలనీడంలేదు. వెళ్ళిపోతున్నవెంకుబాబుని మైకం కమ్మిన కళ్ళతో చూసేడు కృష్ణమూర్తి!

చిత్రం!

వెంకుబాబు నీవరోకాదు ... సాక్షాత్తు వేణుగోపాలస్వామి ... అతనిచేతిలో వున్నది విస్కీసీసా కానే కాదు—వెన్నెల్లా పాలగా నవ్వుతూన్న పసిబిడ్డ, అపరంజి బొమ్మ ఆడపిల్ల!

వెంకబాబుని ఆగిపొమ్మని కేక పెట్ట బోయేడు కృష్ణమూర్తి—

ఇంతలో...

ఫోను మోగింది. బహుశా ఈపిలుపు తనకోసమే కావచ్చు. ఇంట్లోంచి అన్నపూర్ణ చేస్తోంది కాబోలు! కాదు కాదు... పెదబాబు పిలుస్తున్నాడేమో! ఏ ఖబురు చెబుతాడో...ఏం వినవలసి వస్తుందో...

'భగవంతుడా!' అనుకుంటూ, వణుకుతూన్న చేతులతో ఫోనెత్తేడు కృష్ణమూర్తి! ●

# వారఫలం

**22 10 1971 శుక్రవారం మొదలు**
**28 10 1971 గురువారం వరకు**

**మేషం**: కొన్ని వ్యవహారాల్లో మీరు శ్రమ పడినా, ఫలితం దక్కదు. ఉద్యోగంలో చికాకులు యేర్పడతాయి. వారం మధ్యలో ప్రయాణాలు ఫలిస్తాయి. సంతోషకరమైన వార్తలను వింటారు. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

**వృషభం**: భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు లాభిస్తాయి. సాటివారిలో గౌరవం లభిస్తుంది. వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషికి ఆటంకాలు వస్తాయి. వారం ఆఖరులో తిరిగి అనుకూలత లభించ గలదు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**మిథునం**: వృత్తిలో శ్రమ మీద అనుకూలత లభిస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ప్రయాణాలోచనలు చేస్తారు. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాల్లో వ్యతిరేకత యేర్పడుతుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ఆడంబరం కోసం వ్యయం జరుగుతుంది.

**కర్కాటకం**: వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. సాటివారితో మాట పట్టింపులు తగవు. కోర్టు వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**సింహం**: సామాన్యమైన పనులకు కూడా మీరు యెంతో కృషి చేయవలసి వస్తుంది. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. అనవసరమైన సందేహాలు కలుగుతాయి.

స్త్రీలకు:— వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు. దైవకార్యాలు నెరవేరతాయి.

**కన్య**: వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. కొన్ని వ్యవహారాల్లో మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. ప్రయాణాలోచనలు చేస్తారు. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. సాటివారిలో గౌరవం లభిస్తుంది.

**తుల**: అన్ని వ్యవహారాల్లోను మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. కొన్ని వ్యవహారాల్లో ఆదాయం కంటే అడావుడి అధికంగా ఉంటుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**వృశ్చికం**: వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు బాగుంటాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. అనుకూల వార్తలను వింటారు.

**ధనుస్సు**: లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో అనుకూలమైన మార్పులు వస్తాయి. వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. మీ ఆలోచనలు ప్రయోజనకరంగా ఉంటాయి.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అధిక వ్యయం జరుగుతుంది.

**మకరం**: వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్యలో మీ తాలూకు వస్తువులు పోవచ్చును. ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**కుంభం**: వృత్తిలో ప్రయోజనంగల సంభాషణలను జరుప గలరు. సాటివారిలో గౌరవం లభిస్తుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో ఆకస్మికంగా వ్యతిరేకత యేర్పడుతుంది.

స్త్రీలకు— దైవకార్యాలు నెరవేరతాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**మీనం**: వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. స్థిరాస్తి వ్యవహారాలు బాగా ఉంటాయి. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

— మహేష

# ప్రొద్దుటి తాజాతనము గంటల గంటలకొద్దీ

ఆ ప్రాతః కాలపు అభినవ చైతన్యాన్ని స్నానం అయిన తరువాతకూడా గంటలకొద్దీ వుంచుకోండి పాండ్స్ డ్రీమ్ ఫ్లవర్ టాల్కుతో

భారతదేశంలో విస్తారంగా అమ్ముడయే టాల్కు కోమలమైన పరిమళం వస్తూనే వుంటుంది.

పాండ్స్ డ్రీమ్ ఫ్లవర్ టాల్కు చర్మపు తేమను పీల్చుకుంటుంది సన్నిహితమైన శాలిత్యాన్ని కల్గించి మండు వేసవికాలంలో ఉక్కబెట్టేటప్పుడు కూడా చల్లదనాన్ని నవచైతన్యాన్ని సువాసనను మీకు కలిగిస్తుంది. వీటికేదాదీ అన్ని కాలాలలోను మీరు వుపయోగించగల టాల్కు.

3 సైజులలో లభిస్తుంది
ఫ్యామిలీ — లార్జి — మీడియమ్.




## పాండ్స్
## డ్రీమ్ ఫ్లవర్ టాల్కు

మీ తాహతుకు మృదువైన లక్జరీ టాల్కు

చీస్‌బ్రో పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్.
(పరిమితి బాధ్యతతో USAలో స్థాపితము)

# "మిగతా మనుష్యులకు నష్టం కలగనంతవరకు ఆశపడొచ్చు"–నాగేశ్వరరావు

ఇరవై ఏడు సంవత్సరాలుగా ఆంధ్ర ప్రేక్షకుల అభిమాన కథానాయకుడుగా విరాజిల్లడమంటే మాటలా! కృషితో నాస్తి దుర్భిక్షం అని నిరూపించారు నటసామ్రాట్ నాగేశ్వరరావు. ఇటీవలే అక్కినేని తన కుమార్తెకు పెండ్లి చేశారు. ఆమెకు ఇది తొలి దీపావళి. ఈ పండుగను ఎలా జరుపదలచారో కనుక్కొని పాఠకులకు తెలియచేద్దామనుకొని అక్టోబరు 3 న హోటల్ 'సవేరా'లో అక్కినేనిని కాంటాక్టు చేశాను.

* * *

'ప్రేమనగర్'లో మీ నటన అద్భుతంగా వుంది. అంటూ మా భేటీని ప్రారంభించాము.

ప్ర : నటసామ్రాట్ బిరుదాన్ని ఎవరు ఏ సందర్భంలో ఇచ్చారు ?

జ : 1957 లో విజయవాడలో నాకు సన్మానం జరిగినప్పుడు డా॥ బెజవాడ గోపాలరెడ్డి నటసామ్రాట్ బిరుదన్నిచ్చారు.

ప్ర : విగ్రహారాధనమీద మీకు నమ్మకం లేకపోవడానికి కారణమేమిటి ?

జ : విగ్రహాలను గురించి నేను ఎక్కువగా ఆలోచించలేదు. విగ్రహాలు తయారు చేసిన మనుష్యుల శక్తిపై నాకు నమ్మకం ఎక్కువ. అన్నింటినీ మించి విగ్రహాలనుగాని దైవాన్ని గురించిగాని, ఆలోచించి, నిర్ధారణం చేసేశక్తి నాకు లేదు.



'మనుష్యుల శక్తిపై నమ్మకం

ప్ర : మీ కుమార్తెకు ఇది తొలిదీపావళి గదా! విశేషంగా జరుపదలచారా ?

జ : నా కుమార్తెకు ఇపుడు వయస్సు 19 సంవత్సరాలు. అంటే ఆమెకళ్ళముందు 18 దీపావళులు జరిగినట్టేగా. కాబట్టి ఈసారి ప్రత్యేకత ఏమీలేదు.

* * *

ప్ర : దేవదాసుకు, కల్యాణ్‌కు గల వ్యత్యాసం ఏమిటి ?

జ : రెండుపాత్రల తేడాను ఆత్రేయ గారు నా ముఖతా స్పష్టంగా వివరీకరించారు. రెండు పాత్రలు భిన్నమైనవి, నటుడి నటనా శక్తిని పరీక్షించేవి.

ప్ర : చక్రవర్తి చిత్ర యొక్క భవిష్యత్తు ఏమిటి ?

జ : త్వరలోనే తెలుస్తుంది.

హుండీలో డబ్బులా రామ రామ!

ప్ర. మీరు దేవుణ్ని ఎప్పుడూ ఏదీ




ఆంధ్ర విజయ. సికిం: జయలక్ష్మి నైజాం. ఉషా. మైసూర్ బాలాజీ

కోరలేదా! హుండీలో విరాళమైనా డబ్బు వేసి యున్నారా?

జ: ఎంతవరకు కోరలేదు. ఇకముందు కోరను. హుండీలో డబ్బులా! రామ రామ! అలాంటిది నే నెఱుగను.

ప్ర: మీతండ్రి జ్ఞాపకార్థం ఏమైనా చేస్తున్నారా?

జ: నా తండ్రిని నేను మరచిపోతేగదా, ఏదైనా చేయడానికి. ఆయన నా మనస్సులో మెదలుతున్న దైవం.

ప్ర: డిస్ట్రిబ్యూషన్ సంస్థ ఎందుకు

## నాగేశ్వరరావు

పెట్టుకొన్నారు?

జ: చక్కటి వ్యాపారం కాబట్టి.

ప్ర: ఒకనటుడ్ని మరొకరు ఇమిటేట్ చేయడం తప్పా?

జ: స్వతహాగా ఆలోచించి నటించగలిగిన నటునికి ఇమిటేషన్ ఎందుకండీ? అలా నటించలేని వాడికి ఇమిటేషనే శరణ్యం.

### సమయస్ఫూర్తి

ప్ర: నటుడిగా రిటైర్ అయిం తర్వాత డైరెక్టరవుతారా? పొలిటీషియన్ అవుతారా?

జ: ముందుగా నిర్ణయం తీసుకొనే అలవాటు నాకులేదు. (సమయం వచ్చినపుడు తప్ప)

ప్ర: మనిషికి ఆశ ఎంతవరకువుండవచ్చు?

జ: మిగతా మనుష్యులకు నష్టం కలగనంతవరకు.

### నా నిర్మాతలు నవ్వుతూ వుండాలి

ప్ర: మీరు మద్రాస్‌లో నటిస్తే నిర్మాతలకు లక్ష కలిసివస్తుందటగా. మరి వాళ్ళకోసం?

జ: వాళ్ళకు లక్ష మాత్రం మిగలడం నాకిష్టంలేదు. నా నిర్మాతలందరూ నవ్వుతూ వుండాలి అనేదే నా ధ్యేయం. ఇక నష్టమంటారా మంచి చిత్రం కానప్పుడు ఎక్కడైనా ఒక్కటే.

ప్ర: సబ్‌సిడీ రద్దుకు కారణమేమిటి? మళ్ళీ వచ్చే అవకాశం వుందా!

జ: ఎలక్షన్‌లో ఒకసారి వోడితే ఎక్కువసార్లు జయించడానికి అవకాశం వుంది. అలాగే సబ్సిడీని ఒకసారి తీసేస్తే, మళ్ళీ రావడానికి అవకాశం వుందిగా.

ప్ర: మీరు ప్రేమించేది దేనిని; మీకు కోపగించేది యేది?

జ: నాకు పనికి వచ్చే విమర్శలను ప్రేమిస్తాను. అతిగా పొగిడే వాళ్ళపై కోప్పడతాను.

ప్ర: మీకు రెండుసార్లు కాలు విరిగి కూడా స్పీడ్‌గా స్టెప్స్ ఎలా వెయ్యగలుగుతున్నారు?

జ: కాలు విరిగింది; స్పీడ్‌గా స్టెప్స్ వేస్తున్నాను; కాలు నొప్పిగానూ వుంటుంది. అయినా ఎలాగో చేయగలుగుతున్నాను.

### నిరభ్యంతరంగా నటిస్తాను

ప్ర: విజయా, వాహినీ, పంపిణీ సంస్థలలో నటించడానికి మీకు అభ్యంతరమా?

జ: నేను నటుడ్ని, నా నటవృత్తి వ్యాపారానికి సంబంధించినది. వ్యాపారసరళి బాగా కలిసివస్తే నిరభ్యంతరంగా నటిస్తాను.

ప్ర: ఇండియా, రష్యా ఒప్పందంపై మీ అభిప్రాయం?

జ: మనదేశం బాగుపడడానికి, మనదేశ ప్రతిష్ఠ నిలబడడానికి జరిగే ఏ పనైనా హర్షించదగినదే. అలాంటి మంచి పనే ఇండో — రష్యా ఒప్పందం

ఇంటర్వ్యూ : శ్రీనివాస్ ●

# సినిమా

## తిరుపతిలో జరిగింది ఏమిటి ?

'వింతో వుత్సాహంతో, తిరుపతి 'దసరా బుల్లోడు' 260 వ రోజు వేడుకను తిలకించవచ్చిన లక్షలాది అభిమాన ప్రేక్షకులను అనివార్య పరిస్థితులవల్ల కలుసుకోలేనందుకు మేము వింలో విచారిస్తున్నాము. మమ్మల్ని క్షమించమని కోరుతున్నాము. అన్యధా భావించవద్దని ప్రార్థిస్తున్నాము' అన్నారు హీరో నాగేశ్వరరావు, జగపతి రాజేంద్రప్రసాద్‌లు.

## సినిమా డైరీ

● జెమినీ ప్రొడక్షన్స్ వారి ఈస్ట్‌మన్ కలర్ చిత్రంయొక్క షూటింగు అక్టోబరు 1 నుండి 12 వరకు జెమినీలో జరిగింది. అక్కినేని, కాంచన, గీతాంజలి, ధూళిపాళ, సత్యనారాయణ, నిర్మల కృష్ణంరాజు మరియు నాగభూషణం పాల్గొన్నారు. వి. మధుసూదనరావు దర్శకుడు.

● శ్రీ విజయవెంకటేశ్వరా ఫిలింస్ 'పవిత్ర హృదయాలు' మైసూరు బృందావనంలో అక్టోబరు 6 నుండి 8 వరకు జరిగింది. ఎన్టీఆర్, చంద్రకళ పాల్గొన్నారు. ఏ.సి.త్రిలోకచందర్ దర్శకుడు.

● ఉషశ్రీ వారి 'మానవుడు—దానవుడు' షూటింగు అక్టోబరు 2 నుండి 13 వరకు సీనస్‌లో జరిగింది. శోభన్, శారద, కృష్ణకుమారి, మాలతి, అర్జాజనార్దనరావు, మంజుల, ఆదినారాయణ, సత్యనారాయణ పాల్గొన్నారు. పి. చంద్రశేఖరరెడ్డి దర్శకుడు.

● ప్రసాద్ ఆర్ట్‌పిక్చర్స్ వారి అవుట్‌డోర్ షూటింగు అక్టోబరు 8 నుండి జరుగుతుంది. నాగేశ్వరరావు, జయలలిత పాల్గొంటున్నారు. తాతినేని రామారావు దర్శకుడు.

● విజయలక్ష్మీమూవీస్ వారి 'అమ్మమాట' షూటింగు పూర్తయింది. వి. రామచంద్రరావు దర్శకుడు.

## సెయిన్ ఆఫ్ అయింది

'మేమంతా మద్రాసులో గం. 1—40 ని లకు డీలక్స్ బస్సులో బయల్దేరాము. మార్గ మధ్యంలో ఆచార్య ఆత్రేయగారి కారు యాక్సిడెంటుకు గురి కావడంవల్ల, అక్కడ కాస్సేపు బస్సును ఆపాము. అయినా తిరుపతికి 6 గంటలకల్లా చేరుకున్నాము. మేము ట్రన్ మార్చుకుని వెంటనే వేదిక దగ్గరకొచ్చాము. 'స్టేజినుండి చూస్తే ప్రజలు లక్షపైగా వున్నట్టు కనిపించారు. ఇంతమంది మనకోసం వేచియున్నారే, వీరి

బహుమతి ప్రదానం చేస్తే జూ ఆ క్యాపీన్ దర్శకుడు అవి మరోసారి ఋజువు చేసుకున్నాడు మధుసూదనరావు. మంచిన టి అని పేరు తెచ్చుకుంది కాంచన. ఉత్తమ చిత్రాలను ఆదరిస్తాము అని హామీ యిచ్చారు ఆంధ్ర ప్రేక్షకులు...

## తండ్రి, తనయుడుగా శోభన్ బాబు ద్విపాత్రాభినయం

ఒక తెలుగు వారపత్రికలో సీరియల్‌గా వచ్చిన 'విధి విన్యాసాలు' ఆధారంగా సత్య చిత్ర నిర్మించిన చిత్రం 'తాసిల్దారుగారి అమ్మాయి.' ఈ చిత్రంలో శోభన్‌బాబు తండ్రి తనయుడిగా ద్విపాత్రాభినయం చెయ్యడం ఒక విశేషం. రెండు పాత్రల వైవిధ్యాన్ని బాగా ప్రదర్శించారు శోభన్ బాబు అని రషస్ చూసినవాళ్ళు అంటున్నారు.

* * *

జమునతో శోభన్‌బాబు (రొమాంటిక్ పెర్‌గా) నటించడం మరో విశేషం. ఈ కొత్త జంట చూడముచ్చటగా వుందంటున్నారు. కావిలిపాటి విజయలక్ష్మి వ్రాసిన

## మీకు తెలుసా?

కాంతారావు జేమ్స్‌బాండ్‌గా నటిస్తున్న చిత్రం కలర్‌లో నిర్మింపబడ గలదట.

హరనాథ్ సమర్పిస్తున్న చిరంజీవి చిత్రవారి పాంఫికం కలర్‌లో నిర్మించ బడుతూంది.

జ్యోతిలక్ష్మితో ఒక తెలుగు నిర్మాత ఆంగ్ల చిత్రం నిర్మిస్తారట. ఆమె జాతకం మారింది!

శోభన్‌బాబు యికపై సంవత్సరానికి 8 చిత్రాలను మాత్రమే అంగీకరిస్తారట. ది గుడ్ సైన్!

నట సామ్రాట్‌కు 'విశాల నేత్రాలు' కథపై విపరీతమయిన మోజు వున్నట్టు తెలుస్తూంది.

'విధి విన్యాసాలు' కథకు డి.వి. ఆర్. నంది భావగర్భితమైన మాటలను సమకూర్చారు. కె. వి. మహదేవన్ వినిపించిన బాణీలలో మూడు ప్రజాదరణ పొందడం ఖాయం. (నేను పిల్లని కాన్నాను కాదట) తాసిల్దారు పాత్రను నాగభూషణం అత్యంత ప్రతిభావంతంగా పోషించారని తెలుస్తూంది. శ్రీయుతులు సత్యనారాయణ, సూర్యనారాయణలు నిర్మించిన 'తాసిల్దారుగారి అమ్మాయి' చిత్రంలో చంద్రకళ, నిర్మల, రావికొండలరావు, సాక్షి రంగారావు ముఖ్య పాత్రధారులు. ఛాయాగ్రహణం యెవరో తెలుసా? క్రెడిట్ ఆఫ్ ది డే మిస్టర్ వెంకటరత్నం. ఇక దర్శకుడెవరంటారా? అనుభవజ్ఞుడు. ప్రతిభావంతుడు అయిన కె. ఎస్. ప్రకాశరావే. విడుదల లక్ష్మి ఫిలింస్.

—శ్రీనివాస్ ●

## రచయిత్రి ఉత్తరం

8—10—71 ఆంధ్రసచిత్ర వారపత్రిక సినిమా వార్తలలో పావనవ్వింది నవలని శ్రీ టి. ఎల్. కాంతారావు సినిమాగా రూపొందిస్తున్నట్టు ప్రచురించిన వార్త వాస్తవంకాదని తెలియ పరుస్తున్నాను. శ్రీ కాంతారావు అప్రయత్నం చేసిన మాట నిజమే. కాని కొన్ని కారణాలవల్ల నేనుఅమ్మలేదు. శ్రీ కాంతారావు తానా నవలని కొన్నట్లు మీకెట్లా చెప్పారో నాకుతెలియటం లేదు.

పైరీ విషయాన్ని వెంటనే ప్రచురించవలసినదిగా కోరుతున్నాను.

—'అరుణ.' ●



# 'నాకు నేనే దూరమయ్యాను మళ్ళీ నటిస్తున్నాను' — కృష్ణకుమారి



మనకున్న వుత్తమ నటీమణుల్లో కృష్ణకుమారి ఒకరు. ఆమె ఎన్నో సార్లు వుత్తమనటిగా ప్రజలచే ప్రశంసించబడింది. ఆమె కొంతకాలం సినిమా నటనకు దూరమైంది. ఇటీవలనే ఆమె మళ్ళీ రంగప్రవేశం చేసింది. ఉషశ్రీవారి 'దానవీరశూరకర్ణ' సెట్లో (వీనస్ స్టూడియోలో) కృష్ణకుమారిని కలిసాను.

ప్ర: మళ్ళీ వుధృతంగా నటిస్తున్నట్లు వున్నారే?

జ: మూడు చిత్రాల్లో మంచి పాత్రలను పోషిస్తున్నాను. పి. ఏ. పి. చిత్రం, విఠలాచార్య చిత్రం, చిన్నప రెడ్డి చిత్రంలో వైవిధ్యమయిన పాత్రలు దొరికాయి. ఇవిగాక 'మండోదరి'గా నటిస్తున్నాను.

ప్ర: మీకు మళ్ళీ సినిమాఛాన్సులు వస్తాయని తెలుసా?

జ: నేను కలలో కూడా అనుకోలేదు మరలా నేను చిత్రాల్లో నటిస్తానని. అంతా విధి లిఖితం.

ప్ర: మీకు జాతకం వుందా? ఎవరయినా జోస్యం చెప్పారా?

జ: నా జాతకాన్ని శ్రీ వుప్పాల లక్ష్మణశాస్త్రి చూసారు. నేను మరలా నటిగా గుర్తింపబడగలనని ఆయన చెప్పారు.

ప్ర: మీకు ఏ గ్రహాల్లో ప్రశాంతంగా వుంటుందని కూడా ఆయన చెప్పారా?

జ: చెప్పారు. శని మహాదశలో కేతు భుక్తిలో నాకు మంచి కాదని చెప్పారు. శుక్రభుక్తిలో చాలా ఆశాజనకంగా వుండగలదని కూడా ఆయనే చెప్పారు.

ప్ర: అంటే మీకు శాస్త్రాలపై నమ్మకం వుందన్న మాటేగా?

జ: సుమారుగా వుంది. ఇప్పుడు మరింత ఎక్కువైంది.

ప్ర: పెండ్లి తరువాత సినిమాలకు స్వస్తిచెప్పి బెంగుళూరుకు వెళ్ళారు గదా అక్కడ మీకు పొద్దు ఎలా పోయేది?

జ: సినిమాల్లో నటించని నాకు నేనే దూరమయ్యాను. మొదటి ఆరు మాసాలు బోర్ కొట్టింది. ఆపైన గార్డెనింగ్, పిక్‌నిక్‌లతో కాలక్షేపం జరిగేది.

ప్ర: మీరు ఎలాంటి పుస్తకాలను చదివేవారు?

జ: మావారు రోజుకి అరడజను ఇంగ్లీషు డిటెక్టివ్ నవలలను తెచ్చేవారు. వాటిని, మన తెలుగు పత్రికలను చదివేదాన్ని.

ప్ర: మీ దాంపత్య జీవితం ఎలా వుంది?

జ: నిత్యనూతనంగా, చాలా సంతోషంగా వుంది.

ప్ర: మీకు తల్లి కావాలనే ఆపేక్ష లేదా?

జ: ఎందుకు వుండదు. దేనికైనా ఆ భగవంతుడే కరుణించాలిగా.

ప్ర: మీకు సంతాన ప్రాప్తి వుందో లేదో తెలుసుకోలేదా? (జ్యోతిష్యుని వద్ద).

జ: ఈసారి వెడితే, ఆ పాయింటునే అడుగుతాను.

ప్ర: మీరు దీపావళి పండుగను ఎక్కడ, ఎలా జరుపుతారు?

జ: బెంగుళూరులో, మా శ్రీవారితో వైభవంగా జరుపుతాము.

ప్ర: 'దీపావళి'కి ఏం కొంటారు?

జ: పట్టుచీర (రంగుల డిజైను గలది) కొంటాను. టపాకాయలు, చిచ్చుబుడ్లు, మతాబులు కొంటాను.

ప్ర: టపాకాయలంటే భయం లేదా?

జ: నాటూకు టపాకాయల జోలికి పోను. విష్ణుచక్రం అంటే భయం. చిచ్చుబుడ్లు నా ఫేవరిట్స్.

ప్ర: పిండివంటలు ఎన్నిరకాలు చేస్తారు?

జ: పదిరకాల పిండివంటలుంటాయి. దీపావళి ముందుకూడా చేస్తారు.

ప్ర: మీరు డబ్బుకోసం నటిస్తున్నారా? లేక కళకోసమా?

జ: కేవలం డబ్బుకోసం మాత్రం కాదు. ఎందుకంటే దేవుని దయవల్ల నేను హ్యాపీగా బతికే అంతస్తు, ఆస్తి మావారికి వుంది. ఇంట్లో కూర్చుంటే, నా కళాజీవితం అంతమవుతుంది. అందుకే (కాస్త ఛేంజ్ కోసం) మరలా నటించడానికి అంగీకరించాను.

ప్ర: తెలుగు ప్రేక్షకులపై మీ అభిప్రాయం?

జ: చాలా తెలివైనవాళ్ళు; నన్ను యిప్పటికీ యెప్పటిలాగే అభిమానిస్తున్నారు. 'మీరు మరలా నటించాలి' అని నాకు ఎంతోమంది వుత్తరాలు వ్రాసారు కూడా. నన్ను ప్రోత్సహించి, అభిమానించే లక్షలాది ప్రజలకు ఆంధ్రసచిత్రవారపత్రికద్వారా నా కృతజ్ఞతాభివందనాలను తెలుపుకుంటున్నాను.

— శ్రీనివాస్

Printed and Published by S Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1 and at Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3.

Regd. No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.